# భారతీయ సంస్కృతి

రచన

ఆచార్య ఎస్.బి. రఘునాథాచార్య





ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి.

# భారతీయ సంస్కృతి

ఆచార్య ఎస్.బి. రఘునాథాచార్య, ఎం.ఏ., పి.హెచ్.డి.,




ప్రచురణ
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి
2008

**BHARATIYA SAMSKRITI**
(Indian Culture)

By :
**Prof. S.B. Raghunathacharya**

First Edition : 1993, 2008

Copies : 5000

T. T. D. Religious Publication Series No. : 436

Published By :
**Sri K.V. RAMANA CHARY, I AS**
Executive Officer,
T.T. Devasthanams,
Tirupati - 517 507.

Cover :
**Jagadeesh**

Printed at :
**Gayathri Art Printers**
Hyderabad.
Ph 27670210

# ముందుమాట

బుద్ధిబలం శరీరబలం కన్నా గొప్పది. బుద్ధిబలం కన్నా ఆత్మబలం గొప్పది. ఒక జాతి నిర్వీర్యం కాకుండా ఆత్మబలంతో ఆదర్శంగా తీర్చి దిద్దబడాలంటే మంచి సంస్కారమనే దృఢమైన పునాది కావాలి. ఆ సంస్కారాన్నే పెద్దలు సంస్కృతి అన్నారు. శరీరబలం, బుద్ధిబలం కొంచెం తగ్గినా ఆత్మశక్తితో మళ్లా దాన్ని పూరించుకోవచ్చు. కాని ఆత్మ సంస్కారం లోపించిన జాతిని ఎవ్వరూ ఉద్ధరించలేరు. జనజీవనవాహిని ప్రశాంత సుందరంగా పయనించాలంటే దానికి ఉదాత్త గంభీరమైన సంస్కృతి ఒరవడి కావాలి.

భారతీయులమైన మనమందరం గర్వించే రీతిలో మన పెద్దలు ఎన్నో సంస్కార రత్నరాసులను సమకూర్చారు. ఆ సంస్కృతిలో అంతర్లీనమైన సువిశాల దృక్పథం ప్రతి వ్యక్తికి ఉదాత్తమైన భావనలను కలిగించి తద్వారా సమాజాన్ని ప్రశాంతిపథంలో నడిపించి మానవజీవనానికొక నూతనమైన అర్థాన్ని పరమార్థాన్ని అందించగలది.

ఋగ్వేదం నుంచి ఆధునికసాహిత్యం వరకు ఆర్ష సంస్కృతి జీవనాడిగా ఉండి మానవ జీవితానికొక అర్థాన్ని పరమార్థాన్ని చూపి, ఆదర్శ జీవనానికుపయోగించే మానవత్వపు విలువల్ని ప్రస్తావించింది. వాటిలోని సారాంశాన్ని సంగ్రహించి ప్రొఫెసర్ ఎస్.బి. రఘునాథాచార్య గారు (కో-ఆర్డినేటర్, పబ్లికేషన్స్, తి.తి.దే.) ''భారతీయ సంస్కృతి'' అనే ఈ రచనను ఆంధ్రుల కందించారు. వారిని మనసారా అభినందిస్తున్నాను.

హిందూ ధర్మోత్తేజానికి అంకితభావంతో ఈ ప్రచురణను మీముందుంచుతున్నాము.

ప్రథమ ముద్రణ ప్రతులు అయిపోయినందున పునర్ముద్రించడం జరిగింది.

కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

# రెండు మాటలు

ప్రొఫెసర్ ఎస్. బి. రఘునాథాచార్య
ఆచార్యులు & అధ్యక్షులు : సంస్కృతవిభాగం
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి.

భారతీయ సాహిత్యాలన్నింటికీ మూలమైన సంస్కృతసాహిత్యంలో వ్యక్తిత్వసమున్నతికి, సమాజాభ్యుదయానికి కావలసిన విలువలెన్నో చెప్పబడి నాయి. వాటినన్నింటిని ఒకచోట చక్కగా నిరూపిస్తే ఒక నిండైన భారతీయ వ్యక్తిత్వం రూపుదిద్దుకుంటుందనే ఆలోచన నాకెప్పటినుంచో వుంది. దానికి కార్యరూపమే ఈ "భారతీయసంస్కృతి".

తిరుమల తిరుపతి దేవస్థానాల కార్యనిర్వహణాధికారి, ఉత్సాహశక్తి సంపన్నులు సహృదయ శిరోమణులు శ్రీ డి.వి.ఎల్.ఎన్. మూర్తి, ఐ.ఏ.ఎస్. గారు దీన్ని తి.తి.దే. ప్రచురణగా స్వీకరించి అందమైన ముందుమాటతో అలంకరించారు. అందుకు వారికి నా కృతజ్ఞతా నవమల్లికల నందిస్తున్నాను.

తి. తి. దేవస్థానాల ముద్రణాలయాధికారి శ్రీ ఎమ్. విజయ కుమార్‌రెడ్డి దీన్ని చక్కగా ముద్రించినందుకు వారికి, వారి సిబ్బందికి నా ధన్యవాదాలను తెలియజేస్తున్నాను.

భారతీయసంస్కృతిలోని ఆణిముత్యాలను తమ హృదయసీమలో ధరించాలనుకొనే పాఠకులందరికీ, ఇది చక్కని అవకాశం. దీన్ని అందరు వినియోగించుకుంటారని నమ్ముతున్నాను.

తిరుపతి,

-- ఎస్. బి. రఘునాథాచార్య

# భారతీయసంస్కృతి

# భారతీయసంస్కృతి

## 1. ఉపోద్ఘాతం :

నేటి మానవుని జీవితం నిన్న మొన్నటి మానవచరిత్ర ఆధారంగా నడుస్తుంది. తన గతచరిత్రను పురాతనవైభవాన్ని విస్మరించిన జాతి ప్రగతిపథంవేపు నడవనూ లేదు. అలాగే తిరోగతిపథాన్నుంచి తప్పించు కోనూ లేదు. ప్రాచీన భారతీయుల చరిత్రకు చక్కని అక్షరప్రతిరూపమే సంస్కృతసాహిత్యం. చరిత్రకందని కాలం నుంచి గల మానవజాతి మనుగడ అందులో స్పష్టంగా గోచరిస్తున్నది. శిలమైపోయింది పోగా దొరుకు తున్న దాన్ని కూడా ఈనాడు ఆదరించలేకపోతున్నాం. నిర్లక్ష్యం చేస్తున్నాం. రంగులు పులుముతున్నాం. ఇందువల్ల నష్టపోయేది ఎవరు? ఎవరో పరా యివాళ్లు కాదు? మనం; మన వారసులైన ముందుతరాలవాళ్లు. మరి తరతరాల నుంచి వస్తున్న ఇతర సాహిత్యాలు కూడా ఉన్నాయికదా? ఒక్క సంస్కృతభాషకే అంత ప్రాధాన్యమెందుకివ్వాలి? అనేది ఒక ప్రశ్న. సంస్కృతసాహిత్యం అతి ప్రాచీనమైంది కాబట్టి, సృష్ట్యాదినుండి మానవ జాతి కల్యాణానికి అంకితమైంది కాబట్టి.

## 2. సంస్కృత సాహిత్యం :

సంస్కరింపబడిన భాష, సంస్కారవంతుల భాష, సంస్కారాన్ని కలి గించే భాష కనుక గీర్వాణవాణి సంస్కృతభాష అని వ్యవహరింపబడుతున్నది. ఈ భాష అతి ప్రాచీనమైనదనడంలో సందేహం లేదు. ఇది ఆసేతుశీ తాచలం ఒకప్పుడు భారతీయ భాషలకు మూలభాషగా ఆదరింపబడింది. ఆయా ప్రాంతీయ భాషలకు ఇది ఎంతో శక్తిసామర్థ్యాలను, ఊపును అందించింది. ఈ భాషలో నిబంధింపబడిన సాహిత్యమే సంస్కృతసా హిత్యం. ఇది మానవత్వపు విలువలకు అంకితమైన సాహిత్యం. మానవుణ్ణి పరిపూర్ణమైన వ్యక్తిగా శక్తిగా రూపొందించే సాహిత్యం.

## 2.1 స్వరూపం :

భగవంతుని నిఃశ్వాసరూపాలైన వేదాలు మంత్రద్రష్టలైన కొందఱు మహర్షులచేత దర్శించబడ్డాయి. అవి వైదిక సంస్కృత భాషలో ఉన్నాయి. సంహితలు, బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, ఉపనిషత్తులని నాలుగు రంగాలలో వైదిక వాఙ్మయం ఏర్పడింది. ఆదికవి, మధుమయ ఫణితులకు మార్గదర్శి అయిన వాల్మీకిమహర్షి రచించిన శ్రీమద్రామాయణం ఆది కావ్యంగా ప్రసిద్ధి చెందింది. ఆ కావ్యంతోనే లౌకిక సంస్కృతభాష రూపుదిద్దుకున్నది. ఆదికావ్యం తరువాత ఏర్పడిన వాఙ్మయమంతా లౌకిక సంస్కృతభాషలో ఉన్నది.

ప్రపంచంలోని ఇతర దేశాలు మాటలాడటం కూడా నేర్చుకోని కాలంలోనే భారతదేశం, ఈనాటికీ ప్రపంచవాఙ్మయరంగంలో సర్వ ప్రథమస్థానాన్ని అలంకరించి తత్త్వ భాండాగారాలుగా ప్రసిద్ధి చెందిన వేదాలను దర్శించింది. మానవజాతి సంతరించుకున్న మహనీయ పుస్తక భాండాగారంలో ఋగ్వేదం మొట్టమొదటిదని మాక్సుముల్లరు ఇలా అంటున్నాడు--

"Rigveda is the first book in the library of man". కనుక ఋగ్వేదం భారతీయవాఙ్మయమణిహారంలో మొట్టమొదటి మణి. అంతే కాదు; ప్రపంచ వాఙ్మయమణిహారంలోనే అది ప్రథమస్థానాన్ని ఆక్రమిస్తున్నది. ఋగ్వేదంతో ప్రారంభించి ఇతర వేదాలు, బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, ఉపనిషత్తులు, వేద భాష్యాలు, సూత్రవాఙ్మయం, ఆగమవాఙ్మయం, దర్శనాలు, ఇతర శాస్త్రాలు -- ఇలా సంస్కృత వాఙ్మయం ఎంతగానో విస్తరించింది. ఇలా శాఖోపశాఖలుగా విస్తరించిన వైదిక -- లౌకిక సంస్కృతవాఙ్మయాలు ఏదో ఒకరోజు ఏర్పడినవి కావు. వేల సంవత్సరాలనుంచి తరతరాలుగా పెరుగుతూ, భారతీయ సంస్కృతిని తీర్చిదిద్దుతూ సమాజకల్యాణానికి ఎంతో దోహదం చేస్తున్నాయి.

ఆదర్శమైన వ్యక్తి ఎలా ఉండాలి? ఆ వ్యక్తికి సమాజంలో అనేక సమస్యలు ఎదురైనప్పుడు వాటినెలా వాడు ఎదుర్కోవాలి? ఎలా పరిష్కరించుకోవాలి? మానవ జీవితానికి ధ్యేయమేమిటి? దాన్ని అతడెలా మంచి మార్గంలో సాధించుకోవచ్చును? లక్ష్యసిద్ధి ఎలా కలుగుతుంది? ఇలాంటి అంశాలను సంస్కృతసాహిత్యం ప్రస్తావించి పరిష్కారాల నందిస్తున్నది. దాన్ని స్థాలీపులాకంగా పరిశీలిస్తే అది మనకందించిన తరతరాల వారసత్వం ఏమిటో మనకర్థమవుతుంది. అందుకే ఈ చిన్న ప్రయత్నం.

## 2.2 స్వభావం :

మానవజీవితానికి ఒక అర్థం పరమార్థం ఉందని భారతీయులేనాడో గుర్తించారు. అందుకే ధర్మం, అర్థం, కామం, మోక్షం అనే నాలుగు పురుషార్థాలను ప్రతివాడు సాధించాలని శాసించారు. అర్థ-కామాలను ధర్మాన్నతిక్రమించకుండా సాధించే మార్గాలనుపదేశించారు. పరమ పురుషార్థమైన మోక్షాన్ని సాధించడంలోనే మానవత్వానికి సార్థకత్వం ఉందనే సత్యాన్ని గుర్తించారు. అందుకే సత్త్వగుణాన్ని పెంచే చక్కని సాహిత్యాన్ని మనకందించారు. రజస్సును తమస్సును దగ్గఱకు రానీయద్దని, పెంచుకోవద్దని శాసించారు. ఇలాంటి స్వభావంగల సంస్కృతసాహిత్యం, మన జీవితాల్లో కారుచీకట్లు కమ్మి మార్గం అగమ్యం, అగోచరం అయినప్పుడు చక్కని ఉపదేశాలనిస్తుంది. మన లక్ష్యాన్ని సాధించడానికి ఉపయోగపడుతుంది.

## 3. తరతరాల వారసత్వం :

సామాన్య మానవుడు నిండైన వ్యక్తిగా రూపొందడానికి, సమాజంలో ఒకరినొకరు గౌరవించుకుంటూ, నిస్స్వార్థంగా ఒకరి మంచిని ఇంకొకరు కోరుతూ, చేతనైనంతవఱకు ఇతరులకు సేవచేస్తూ, వ్యక్తిగతంగానూ, సామాజికంగాను సుఖశాంతులతో జీవితాన్ని గడపటానికి కావలసిన సదుపదేశాలను సాధనమార్గాలను సంస్కృతసాహిత్యం తరతరాలుగా మనకందిస్తున్నది.

ఆ ఉపదేశం ఒకప్పుడు వాచ్యంగాను, ఇంకొకప్పుడు వ్యంగ్యమర్యాదతోను, జరిగినట్లు ఈ సాహిత్యాన్ని పరిశీలిస్తే మనకర్థమవుతుంది.

అయితే సంస్కృతసాహిత్యం కేవలం మోక్షం కోసమేననో, లేక అంతా వేదాంతమేననో, లేక అన్నీ మంత్రాలేననో జనసామాన్యంలో ఒక అపోహ ఉంది. కాని ఇహలోకసుఖాలకు ఈ సాహిత్యం ఎప్పటికీ వ్యతిరేకం కాదు. అయితే అవి శాశ్వతాలని భ్రమపడవద్దని మాత్రం ఇది హెచ్చరిస్తుంటుంది. ఐహిక సుఖభోగాలను ధార్మికంగా అనుభవించడాన్ని ఇది సమర్థిస్తుంది. వాటిని ధర్మబద్ధంగా పొందే మార్గాలను ఉపదేశిస్తుంది. ఇది తరతరాలుగా వారసత్వంగా మానవజాతికి ఈ సాహిత్యం అందిస్తున్న అమృతోపదేశం. దీనికి సంస్కృతసాహిత్యంలో ఒక భవ్యమైన రూపకల్పన జరిగింది.

సంస్కరణ వ్యక్తినుంచి ప్రారంభం కావాలని ప్రాచీన భారతీయుల నమ్మకం. అందుకనే వాళ్లు వ్యక్తిని తీర్చిదిద్దడానికి ఎన్నో మార్గాలనన్వేషించారు. కట్టుదిట్టమైన సమాజాన్ని నిర్మించుకున్నారు. శీలమే పరమావధిగా వ్యక్తిని ఎంతో చక్కగా మలచారు. బాల్యం నుంచి వార్ధకందాకా మానవుడు తన వ్యక్తిగత జీవితాన్ని సార్థకం చేసుకోవడానికి కావలసిన లక్షణాలను ఉపదేశించారు. అలాంటి వ్యక్తులు సమసమాజాన్ని నిర్మించుకుని పరస్పర సేవాభావంలో ధర్మార్థకామాలను పండించుకొని మానవజీవితానికి ప్రధాన లక్ష్యం, చతుర్థపురుషార్థమైన మోక్షాన్ని సంపాదించడానికి ఎలాంటి సాధన కావాలో నిరూపించారు. అశాశ్వతమైన ఈ ప్రపంచంలో ఏది శాశ్వతమో, ఏది నిత్యసత్యమో ప్రబోధించారు. ఈ ప్రయత్నం ఋగ్వేదంతో మొదలై కావ్యవాఙ్మయంవఱకు కొనసాగింది. ఒక్కమాటలో చెప్పాలంటే సంస్కృత సాహిత్యమంతటా జీవనాడిగా ఈ ప్రయత్నం కనబడుతుంటుంది. దాని రూపురేఖల్ని మాత్రం ఇక్కడ సంగ్రహంగా విశ్లేషిస్తాను.

### 3.1 వ్యక్తిగతోపదేశం :

వ్యక్తి సంస్కారవంతుడు కానిదే ఏ సమాజం సంస్కారపూర్ణం కాదు. వ్యక్తిగతమైన సాధన చేయనివాడు సామూహికంగా ఏదో సాధిస్తామనుకోవడం హాస్యాస్పదం. ఈ సత్యాన్ని సంస్కృతసాహిత్యం ఏనాడో

గుర్తించింది. అందుకే ఇది వ్యక్తిగతమైన సాధనను పెంచుకోమని ఎన్ని విధాలుగానో ఉపదేశిస్తుంది. ప్రాచీనభారతీయుల ఆదర్శజీవితాలను వర్ణించే సాహిత్యం ఉత్తమ జీవితాలకొక నిదర్శనంలాంటిది. ఇక్కడ వ్యక్తిగతమైన కొన్ని మంచి లక్షణాలను గురించి సోదాహరణంగా పరిశీలిద్దాం --

### 3.1.1 పితృభక్తి :

ప్రతివాడు కరచరణాద్యవయవాలతో ఒక ఆకారాన్ని ధరించి ఈ లోకంలో ప్రవేశించడానికి తల్లిదండ్రులు ముఖ్యకారణం. నవమాసాలు మోసి కనిపెంచిన తల్లి బిడ్డకు మొదటి గురువు. మొదట ఉత్పత్తికి హేతువై, పుట్టిన తరువాత పెంచి, పెద్దచేసి విద్యాబుద్ధులను నేర్పి ఈ సమాజంలో మంచి పౌరుడుగా తీర్చి దిద్దిన తండ్రి రెండో గురువు. అందుకే ఈ ఇద్దరు ప్రతివానికి ప్రత్యక్షదైవాలని మన వాఙ్మయం చెబుతున్నది.

మాతృదేవో భవ ! పితృదేవో భవ !

అని ఉపదేశిస్తున్నది.

కనపడే దైవాలైన తల్లిదండ్రులను ఏ పరిస్థితిలోను నొప్పించ కూడదు. వారి దీవెనలు పిల్లలకెంతో మంచిని కలిగిస్తాయి.

అలాగే మహాభారతంలోని యక్షప్రశ్నలలో ధర్మజుడు భూమికంటె తల్లి బరువైనదని, ఆకాశంకంటె తండ్రి ఉన్నతమైనవాడని తల్లిదండ్రుల గొప్పదనాన్ని ఇలా ప్రకటించాడు --

"మాతా గురుతరా భూమేః పితా ఉచ్చతరశ్చ ఖాత్"

(మ. భా. వన. 313--16)

### 3.1.2 గురుభక్తి :

నిస్తేజంగా పడిఉన్న బండరాయిని ఎవ్వరూ మొక్కరు. కానీ అదే శిలను శిల్పి తన శిల్పకళాచాతుర్యంతో సుందరమైన దేవవిగ్రహంగా మల చగలిగితే అందరు నమస్కరిస్తారు. ఆరాధిస్తారు. బ్రహ్మరథం పడతారు.

కేవలం మాంసపిండంగా విస్ఫురికాశంగా ఉన్న వ్యక్తిని గురువు దగ్గఱకు చేర్చుకొని, అతడికి కావలసిన జ్ఞానాన్ని ఉపదేశించి, వివేకాన్ని కలిగించి బుద్ధికి పదును పెట్టి జీవితంలో నిలబడే శక్తి సామర్థ్యాలు కలిగిస్తాడు. అందుకే తల్లిదండ్రుల తరువాత ప్రత్యక్ష దైవం గురువవుతున్నాడు. ఆచార్యానుగ్రహం ఉంటే శిష్యుడు దేన్నైనా సాధించవచ్చు. అందుకే ఇలా చెబుతారు పెద్దలు --

ఆచార్య దేవో భవ !

జ్ఞానాంజనశలాకతో గురువు అజ్ఞానాంధకారమగ్నుడైన వాని కళ్లను తెరిపిస్తాడు. అలాంటి గురువుకు నమస్కారమని గురుస్తోత్రం ఇలా చెబుతున్నది--

అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః॥

అలాంటి ఆచార్యుని విషయంలో ఎంతో భక్తిశ్రద్ధలుండాలి.

### 3.1.3 దైవభక్తి :

దైవంపైన విశ్వాసం లేనివాడు దానవుడే అవుతాడు. తన సృష్టికి, స్థితికి కారణమైన భగవంతుడి పైన విశ్వాసం లేనివాడికి తనపైన మాత్రం ఎలా విశ్వాసం కలుగుతుంది? అహంకారంవల్ల అంతా నేనే చేస్తున్నానని అనుకోవచ్చు. కానీ నీసంకల్పాలన్నీ జరగడంలేదే. కనుక జరగవలసిందాన్ని జరిపించే తత్త్వం ఒకటున్నది. అదే మానవాతీతమైన త్రికాలాబాధితమైన పరతత్త్వం.

అటువంటి దైవాన్ని భక్తితో ఆరాధించాలి. అనుసరించాలి. ఆశ్రయించాలి. అంతట ఆయనను దర్శించడం నేర్చుకోవాలి. 'ఈశావాస్యమిదం సర్వమ్' అని ప్రపంచమంతటా నిండి ఉన్న ఆ దేవదేవుని అనుగ్రహాన్ని

ఆత్మార్పణంతో సాధించాలి. ఇది మన ఉపనిషత్తుల ఉపదేశం. శాస్త్రాల శాసనం. ఆగమాల ఆదర్శం. వేదాంతాల సిద్ధాన్తం.

### 3.1.4 త్రికరణశుద్ధి :

మన మనుగడ సవ్యంగా సాగడానికి భగవంతుడు మనకు మూడు సాధనలిచ్చాడు. అవి మనస్సు, మాట, చేష్ట. ఈ మూడింటి మధ్య సమన్వయం ఉండాలి. మనస్సులో అనుకున్నదే మాటలో చెప్పాలి. మాటలో చెప్పిందే ఆచరణలో పెట్టాలి. దీన్నే త్రికరణశుద్ధి అంటారు. ఈ మూడింటి మధ్య సమన్వయం ఎవరు సాధిస్తారో వారు మహాత్ములు. ఎవరు సాధించలేరో వారే దురాత్ములని పెద్దలిలా చెబుతారు --

మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనామ్।
మనస్యన్య ద్వచస్యన్య త్కర్మణ్యన్య ద్దురాత్మనామ్॥

ఈ త్రికరణాలలో సమన్వయాన్ని సాధించమని మన వాఙ్మయం ఎన్నో విధాల ఉపదేశిస్తున్నది.

### 3.1.5 నిష్కామప్రవృత్తి :

ఒకప్పుడు ప్రయత్నించిన పనులు నెరవేరతాయి. ఇంకొకప్పుడు ఏ ఒక్కపనీ పూర్తికాదు. పనులు నెరవేరటానికి, నెరవేరకపోవటానికి మన ప్రయత్నమేనా కారణం? ఇంకేమైనా ఉందా? పనులు పూర్తయితే పట్టలేని సంతోషం. అవి జరగకపోతే కుప్ప కూలి పోవటం. ఇది లోకస్వభావం. కాని ఈ పనికి ఇంత ప్రయోజనం కలుగుతుందా? అంత ప్రయోజనం కలుగుతుందా? అని ముందు ఫలాన్ని దృష్టిలో పెట్టుకోకూడదు. నిష్కామంగా కర్తవ్యభావనతో పనులు చేయాలే కాని ఫలాపేక్షతో చేయకూడదు. ఫలాపేక్షతో చేస్తే సంగం ఏర్పడుతుంది. అందుకే పార్థసారథి భగవద్గీతలో ఇలా ఉపదేశిస్తున్నాడు --

కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన।
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి॥

ఫలాపేక్షతో పనులు చేయకూడదు కదా! అని ఏ పనులూ చేయకుండా అకర్మణ్యుడుగా తయారుకాకూడదు. కర్మలు కర్తవ్యభావంతో చేస్తూనే ఉండాలి. ఫలాన్ని మాత్రం ఆశించకూడదు.

ఇలా నిష్కామప్రవృత్తిని భారతీయుడు తరతరాలుగా అలవరచుకొన్నాడు. అది అతని నరనరాల్లో జీర్ణించిపోయింది.

### 3.1.6 కర్మనిష్ఠ :

కానిపనులు చేయకూడదు. కాని, ఏ పనులూ చేయకుండా ఊరికే కూర్చోకూడదు. దాన్నే అకర్మణ్యత అంటారు. ఎన్ని విఘ్నాలు సంభవించినా నిరుత్సాహపడకుండా ఏదో ఒక పనిని ఫలకామన లేకుండా ప్రతివాడూ చేసి తీరాలని మన వాఙ్మయం ఉపదేశిస్తున్నది. ఏపనీ చేయని సోమరితనంకంటే ఏదో ఒకపని చేయడం మంచిది. ఏపనీ చేయనివాడికి కాలం గడవదు. లోకయాత్ర జరుగదు. కనుక కర్తవ్యనిష్ఠ ఎప్పుడూ అవసరం.

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయోఽహ్యకర్మణః।
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః॥

(భ. గీ. 3.8.)

భగవద్గీతలో పార్థసారథి పార్థునకు ఎప్పుడో చేసిన ఈ ఉపదేశం "నాకేం పని లేదని" చేతులు ముడుచుకొని కూర్చునే ప్రతివాడికి కనువిప్పు ఈనాడు కలిగిస్తుంది. ఏ పనీ చేయకుండా సోమరిగా కూర్చునేవాడు మానసికంగా ఉత్సాహంగా ఉండలేడు. మానసికారోగ్యం లేకపోతే శారీరకంగాను ఆరోగ్యవంతుడు కాలేడు.

సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత।
కుర్యాద్విద్వాంస్తథాఽసక్తశ్చికీర్షుర్లోకసంగ్రహమ్॥

(భ. గీ. 3.25)

కర్మస్వభావం తెలియనివాళ్లు ఫలాపేక్షతో అనేక పనులు చేస్తారు. కర్మబద్ధులౌతారు. కానీ వివేకం కలవాడు "నేను జ్ఞానిని గదా! నేనే పనులు చేయునని" భీష్మించుకు కూర్చోకూడదు. సంగం లేకుండా తన పనులను కర్తవ్యభావంతో చేస్తూ ఉండాల్సిందే. అలా అతడు చేయడంవల్ల ఇతరులు కూడా అతణ్ణి చూసి వాళ్ల వాళ్ల పనులు చేస్తారు. మొత్తంమీద ఫలాపేక్ష లేనివాడు కూడా లోకసంగ్రహంకోసం పనులు చేయవలసిందేనని భగవాన్ ఉపదేశిస్తున్నాడు.

### 3.1.7 కర్తవ్యపాలన :

కర్తవ్యనిష్ఠ లేని మానవుడు ఈ లోకంలో ఏమీ సాధించలేడు. కర్తవ్యభావంతో మాత్రమే పనులు చేయగలిగినవాడు కర్మబంధం లేనివాడవుతాడు. అతడికి తేలికగా నిష్కామకర్మయోగం సిద్ధిస్తుంది. ప్రాణాలు పోయే పరిస్థితి వచ్చినా తన కర్తవ్యాన్ని తాను ఆచరించి తీరాలి. పోయే ప్రాణాలు నిలుపుకోడానికి కూడా కానిపనిని ఎన్నటికీ చేయకూడదు. అందుకే పెద్దలిలా చెబుతారు --

కర్తవ్యమేవ కర్తవ్యం ప్రాణైః కంఠగతైరపి।
అకర్తవ్యం న కర్తవ్యం ప్రాణైః కంఠగతైరపి॥

ఆహా! ఎంతటి కఠినపరీక్ష! ఇలాంటి క్లిష్టపరీక్షల్లో నెగ్గి జటిలమైన సమస్యలనెన్నింటినో మన ప్రాచీనులు పరిష్కరించుకున్నారు. కర్తవ్య పరిపాలనలో ప్రతివాడికి దృఢమైన దీక్ష ఉండాలి. ఫలితం ఎలా జరిగినా సరే మన బాధ్యతను సక్రమంగా నిర్వహించాలి. ఎన్ని ఇబ్బందులొచ్చినా ఇతరులెంత నిరుత్సాహపరచినా మనం వెనకడుగు వేయకూడదు.

### 3.1.8 ప్రతిజ్ఞాపాలన :

ఎన్ని ఇబ్బందులెదురైనా సరే ఆడినమాట తప్పకుండా ఉండగలగడం గొప్ప విషయం. చాలామంది ఆవేశంలో అనేకానేక ప్రతిజ్ఞలు చేస్తారు. కానీ తీరా వాటిని నెరవేర్చడానికి పూనుకునేసరికి స్వార్థమో, భయమో, పక్షపాతమో అడ్డువస్తుంది. నిలబడలేరు. ఏదో వంక చూసుకొని రంగం నుంచి నిష్క్రమిస్తారు. సజ్జనులు మాత్రం సూర్యుడు పడమట ఉదయించినా సరే, మేరుపర్వతం ఇటు అటు కదిలినా సరే, అగ్ని చల్లబారిపోయినా సరే, పద్మం పర్వత శిఖరాన వికసించినా సరే తమ మాటమీద తప్పక నిలబడతారు. అందుకే పెద్దలిలా చెబుతారు --

ఉదయతి యది భానుః పశ్చిమే దిగ్విభాగే
ప్రచలతి యది మేరుః శీతతాం యాతి వహ్నిః।
వికసతి యది పద్మం పర్వతానాం శిఖాగ్రే
న భవతి పునరన్యద్భాషితం సజ్జనానామ్॥

కళకళలాడే శోభ చంద్రుణ్ణి వదిలి పోయినా సరే, హిమవత్పర్వతం మంచును వదిలిపెట్టినా సరే, సముద్రుడు చెలియలికట్టను దాటినా సరే, నేను నాతండ్రి చేసిన ప్రతిజ్ఞను దాటి ఒక్క అడుగు కూడా ముందుకు వేయనని రామాయణంలో శ్రీరాముడిలా అంటున్నాడు --

లక్ష్మీశ్చన్ద్రాదపేయాద్వా హిమవాన్వా హిమం త్యజేత్।
అతీయాత్సాగరో వేలాం న ప్రతిజ్ఞామహం పితుః॥

(వా.రా. )

తన ప్రతిజ్ఞను తను నిలబెట్టడంకంటె తండ్రి ప్రతిజ్ఞను తను నిలబెట్టడం ఎంతో ప్రశంసార్హమైన విషయం. ఆహా! ఎంత చక్కటి చిక్కటి ఆదర్శం! అందుకే ఆయనను మూర్తీభవించిన ధర్మమన్నారు. "రామో విగ్రహవాన్ ధర్మః". దీన్నిబట్టి ప్రాచీన భారతీయుల్లో ప్రతిజ్ఞాపాలనపైన

ఎంతటి దీక్ష ఉందో మనం గమనించాలి. ఇచ్చిన మాటకు కట్టుబడిన జాతి మన భారతజాతి. ప్రతిజ్ఞాపాలనలో వీరికి వీరే సాటి.

### 3.1.9 సత్ప్రవర్తన :

మానవుడు తన ప్రవర్తనను బట్టి ఇహలోకంలో గౌరవార్హుడౌతాడు. ప్రవర్తన సరిగా లేనివాణ్ణి ఎంత నిపుణుడైనా ఈ సమాజం గౌరవించదు. ఎప్పుడో ఒకప్పుడు పొరపాటున ఎవరైనా గౌరవించినా త్వరలోనే తన తప్పును తెలుసుకుంటుంది. అందువల్ల సత్ప్రవర్తన తనకు తన చుట్టూ ఉన్న సమాజానికి మంచిని కలిగిస్తుందని సంస్కృతసాహిత్యం తరతరాలనుంచి మనకు ఉపదేశిస్తున్నది. ఈ క్రింది సుభాషితంలో ఎంతో చక్కగా ఈ అంశం బోధింపబడింది. చూడండి --

పరదార పరద్రవ్య పరద్రోహ పరాఙ్ముఖః।
గంగా బ్రూతే కదాఽగత్య మామయం పావయిష్యతి।

సకల పావని గంగ. ఆమె ఇలా అంటున్నదని కవి ఎంతో లలితంగా సజ్జనులను వారి ప్రవృత్తిని ప్రశంసిస్తున్నాడు. "ఇతరుల స్త్రీల విషయంలోను, ఇతరుల సిరిసంపదల విషయంలోను, ఇతరులను మోస గించటంలోను విముఖుడైనవాడు ఎప్పుడు వచ్చి స్నానం చేయడం ద్వారా నన్ను పవిత్రీకరిస్తాడు"?

ఆహా! అందరినీ పవిత్రీకరించే గంగానది అలాంటి వ్యక్తులు తన పవిత్రతను పెంపొందిస్తారని చెప్పడం ఎంత బాగున్నది. అలాంటి ప్రవృత్తి మనలో ఉండాలని మనకు పెద్దల సందేశం.

మాతృ పితృ కృతాభ్యాసో గుణితామేతి బాలకః।
న గర్భచ్యుతిమాత్రేణ పుత్రో భవతి పండితః॥

చిన్నపిల్లల్లో ఏదైనా దోషం ఏర్పడితే అది వారి తప్పుకాదు. కేవలం వాళ్లను అలా పెంచిన తల్లిదండ్రుల తప్పు. ఎవరూ పుడుతూనే పండితుడు

కాలేదు. తల్లి దండ్రుల పెంపకాన్ని బట్టే వాడిలో సత్ప్రవృత్తిగాని, దుష్ప్రవృత్తిగాని ఏర్పడుతుంది. అందుకనే పిల్లల తప్పులను లెక్కవేసే ముందు వారిని అలా పెంచిన తల్లిదండ్రులను తప్పు పట్టవలసిన అవసరం ఎంతైనా ఉందని మనం గుర్తించాలి.

### 3.1.10 వైరాగ్యం :

మనం పొందుతున్న కొద్ది ఆనందం చెరిగిపోకుండా ఉండాలన్నా, అది ఇంకా ఇంకా పెరిగి మన జీవితం ఆనందమయం కావాలన్నా, చివరకు మనకు ఆ ఆనందం శాశ్వతం కావాలన్నా మనలో ఇంతో అంతో వైరాగ్యభావన కావాలి. అప్పుడే మన జీవితం ప్రశాంతితో శోభిస్తుంది. ఆ విరక్తి లేకపోతే మన వైఫల్యాలు మనల్ని కుంగదీసి సర్వనాశనం చేస్తాయి. వాల్మీకి రామాయణంలో శ్రీరామచంద్రుడు భరతునికి ఇలా ఉపదేశిస్తున్నాడు --

సర్వే క్షయాంతాః నిచయాః పతనాంతాః సముచ్ఛ్రియాః।
సంయోగా విప్రయోగాంతా మరణాంతం చ జీవితమ్॥

(వా. రా. అ. 105. 16)

ఈ ధనరాసులన్నీ ఏదో ఒకరోజు నశిస్తాయి. ఈ అభ్యుదయాలు ఏదో ఒక రోజు పతనమైపోతాయి. ఈ కలయికలు శాశ్వతంగా ఉండవు. జీవితం ఎప్పుడూ మరణంతోనే పూర్తవుతుంది.

అంటే అశాశ్వతమైన ఈ లౌకిక విషయాలకోసం ఎక్కువగా మనస్సును పాడుచేసుకోకూడదు. ఓర్పును ఓపికను పెంచుకొని, వైరాగ్యభావనతో జీవితాన్ని సుఖమయం చేసుకోవాలని పెద్దలమాట.

అశ్నీత పిబత ఖాదత జాగృత సంవిశత చలత తిష్ఠత వా।
సకృదపి చిన్తయతాన్తః పావధికో దేహబన్ధ ఇతి॥

(వై. శ. 54)

మీరు ఎంత పరవశంగా కాలం గడుపుతున్నా ఒక్క మాట ఎప్పుడూ గుర్తుపెట్టుకోవాలి. భోజనం చేయండి, తాగండి, తినండి, మెళకువతో ఉండండి, నిద్రపోండి, తిరగండి, ఒకచోట కూర్చోండి, ఇలా ఎన్ని పనులైనా చేస్తూ కాలక్షేపం చేయండి. నాకేమీ అభ్యంతరం లేదు. కానీ ఈ దేహంతో మీకుండే సంబంధం చాలా కొద్దికాలమేనని, అది ఎప్పుడైనా పోవచ్చుననే విషయాన్ని మరచిపోకుండా ఉండండని నీలకంఠదీక్షితులు తన వైరాగ్యశతకంలో హెచ్చరిస్తున్నాడు.

నారీస్తన భర నాభీదేశం
దృష్ట్వా మాగా మోహావేశమ్।
ఏతన్మాంసవసాదివికారం
మనసి విచిన్తయ వారం వారమ్॥

(భ. గో. 6)

"ఎంత వారలైనా కాంతదాసులే" అని అన్నాడొక మహానుభావుడు. నిజంగా ఆలోచిస్తే పురుషుడెంత అజ్ఞాని అవుతున్నాడో అర్థమవుతుంది. యువతుల స్తనభారాన్ని, ఇతర అందచందాలను చూసి మోహావేశాన్ని పొందకండి. అవి కేవలం మాంసం, కొవ్వు మొ॥ వాటి వికారాలేనని మాటి మాటికి బాగా గుర్తుచేసుకోండి అని ఆదిశంకరులు భజగోవిందస్తోత్రంలో చేసిన ఉపదేశం ఆనాటికీ ఈనాటికి మానవజాతికి శిరోధార్యం. ఎంత వైరాగ్యం కలిగితే అంత శాంతి కలుగుతుంది. అందుకనే వైరాగ్యాన్ని సాధన చేయడం ప్రతివాడికి చాలా అవసరం.

### 3.1.11 కార్యదీక్ష :

ఆరంభశూరత్వం అందరిలోనూ ఉంటుంది. కాని ప్రతిపనిని జాగ్రత్తగా ఆలోచించి చేపట్టడం, చేపట్టిన దాన్ని ఎన్ని విఘ్నాలొచ్చినా బెదరకుండా పూర్తిచేయడం కొందరు మాత్రమే చేయగలుగుతారు. దానికి దీక్ష,

పట్టుదల కావాలి. తొందరపడి ప్రతిపనీ చేయకూడదు. దానికి సంబంధించిన మంచి చెడులను జాగ్రత్తగా పరిశీలించి ఒక నిర్ణయానికి రావాలి. ఎన్ని విఘ్నాలేర్పడ్డా యావచ్ఛక్తిని వినియోగించి ప్రతిఘటించాలేగాని భయపడి పారిపోకూడదు. దీన్ని భర్తృహరి తన నీతిశతకంలో ఇలా ప్రబోధిస్తున్నాడు--

ప్రారభ్యతే న ఖలు విఘ్నభయేన నీచైః
ప్రారభ్య విఘ్నవిహతా విరమన్తి మధ్యాః।
విఘ్నైః పునః పునరపి ప్రతిహన్యమానాః
ప్రారబ్ధముత్తమగుణా న పరిత్యజన్తి॥

అంతంత మాత్రపు వాళ్లు ఏపని మొదలుపెడితే ఏ విఘ్నమొస్తుందోనని భయపడి ఏపనీ చేయరు. కొందఱు ఆరంభశూరులు కొన్ని పనులు మొదలుపెడతారు. ఏదైనా విఘ్నం వస్తే చాలు చటుక్కున అస్త్రసన్న్యాసం చేసి పారిపోతారు. ఇక ఉత్తమగుణ సంపద గల ధీరోదాత్తులు ఎన్నిసార్లు ఎన్ని విఘ్నాలొచ్చినా మొదలుపెట్టిన పని పూర్తయ్యేవఱకు ఓర్పుతో నేర్పుతో తట్టుకొని నిలబడతారు. అంతిమవిజయాన్ని సాధిస్తారు.

అలాంటి పట్టుదల, కార్యదీక్షను గురించి చెప్పుకొనేటప్పుడు మనకు భగీరథుడు మొ॥ మహనీయులు గుర్తుకొస్తారు. వారి బాటలో పయనించి పట్టుదలతో చేపట్టిన పని పూర్తి చేయమనే మన సాహిత్యం బోధిస్తున్నది.

### 3.1.12 శ్రద్ధ :

మనం చేసే పనుల్లో చాలా పనులు శ్రద్ధ లేకపోవడం వల్లనే చెడిపోతుంటాయి. శ్రద్ధలేనివాడిని ఈ లోకంలో ఎవ్వరూ బాగుచేయలేరు. ఎప్పటిపని అప్పుడు చేయాలని క్రమశిక్షణతో ప్రతివాడు పనిచేస్తే అది వ్యక్తిని దేశాన్ని కూడా అభ్యుదయపథంలో నడిపిస్తుంది. రేపు చేయగల

మనకున్న పనిని ఈనాడే పూర్తి చేయడం చేసిన వ్యక్తికి గల శ్రద్ధకు నిదర్శనమని మహాభారతం ఇలా చెబుతున్నది --

శ్వః కార్యమద్య కుర్వీత పూర్వాహ్ణే చాపరాహ్ణికమ్।
న హి ప్రతీక్షతే మృత్యుః కృతమస్య న వా కృతమ్॥
(మ. భా. శాంతి. 175. 15)

రేపు చేయాల్సిన పనిని ఈరోజు, సాయంకాలం చేయాల్సిన పనిని ప్రొద్దున పూట పూర్తి చేయాలి. ఇతడు పనులన్నీ పూర్తి చేశాడా? లేదా? అని మృత్యువు విచారించకుండానే కబళించివేస్తుంది. కనుక జీవితంలో ప్రతిక్షణం ఎంతో విలువైనదనే విషయాన్ని గుర్తుంచుకోవాలి. అలా చేయడంవల్ల అనుకున్నదానికంటే ఎక్కువ అభివృద్ధిని వ్యక్తి, సమాజం సాధించడానికి వీలవుతుంది.

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు॥

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత।
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః॥
(భ. గీ. 17. 2-3)

పుట్టుకతోనే ప్రతివాడికీ సాత్త్విక -- రాజస -- తామస శ్రద్ధలలో ఏదో ఒకటి ఏర్పడుతుంది. అది స్వభావసిద్ధంగా వచ్చే విషయం. అసలు మానవుడు శ్రద్ధాస్వరూపుడు. అతడి శ్రద్ధనుబట్టే అతడి ఆలోచనలు, ప్రవృత్తులు ఉంటాయి. పైకి మనుషులంతా ఒకటిగా కనబడ్డా వారి లోపలి ప్రపంచాలు వేరు వేరుగా ఉంటాయి. సంస్కారాలను బట్టి స్వభావాలు, స్వభావాలను బట్టి శ్రద్ధలు, శ్రద్ధలను బట్టి ప్రవృత్తులు, ప్రవృత్తులను బట్టి వారు సాధించే ఫలితాలు ఉంటాయి. అందుకనే ఏపని చేసినా శ్రద్ధతో చేయడానికి ప్రయత్నించాలని పెద్దల ఆదేశం.

### 3.1.13 స్నేహం :

మనసా వాచా కర్మణా ఒకరినొకరు అర్థంచేసికొని కష్టనష్టాలను సమానంగా జీవితంలో పంచుకోవడాన్నే స్నేహమని, మైత్రి అని అంటారు. పైకి కపటస్నేహాన్ని నటిస్తూ వెనక గోతులు తొవ్వేవాళ్లు ఎక్కువగా ఉంటారు. కాని నిజమైన మిత్రుడు మధురమైన స్నేహానుబంధంతో రెండోవాడికి సహాయం చేయడానికి ప్రయత్నిస్తాడు. పెద్దలు చెప్పిన మిత్రలక్షణాన్ని పరిశీలించండి.

దదాతి ప్రతిగృహ్ణాతి గుహ్యమాఖ్యాతి పృచ్ఛతి।
భుంక్తే చ భోజయత్యేవ షడ్విధం మిత్రలక్షణమ్॥

ప్రేమతో మిత్రుడికి తనకున్న దాన్ని ఇవ్వాలి. మిత్రుడు స్నేహంతో ఇచ్చినదాన్ని పరిగ్రహించాలి. తన మనసులో మాటను అతడికి చెప్పాలి. అతడి మనసులో భావాన్ని అడిగి తెలుసుకోవాలి. అతడాహ్వానిస్తే అతని ఇంట్లో భోజనం చేయాలి. తన ఇంట్లో అతనికి భోజనం పెట్టాలి. ఈ ఆరు లక్షణాలు ఆ ఇద్దరి మధ్య మైత్రీబంధాన్ని పెంచి కష్టసుఖాల్లో ఒకరినొకరు ఆదుకొనేటట్లు చేస్తాయి.

పరోక్షే కార్యహన్తారం ప్రత్యక్షే ప్రియవాదినమ్।
వర్జయేత్తాదృశం మిత్రం విషకుంభం పయోముఖమ్॥

కొందరు ఎదురుగా ఉన్నప్పుడు ఎంతో తియ్యగా మాట్లాడుతారు. మనిషి వాడైతే అతణ్ణి గురించే ఎంతో విమర్శ చేస్తారు. అతడికి కార్యహానిని కలిగిస్తారు. అలాంటి పయోముఖ విషకుంభాలను జాగ్రత్తగా కనిపెట్టి ఉండాలి. పైకి పాలులాగా కనపడినా లోపల విషం ఉంటుంది కాబట్టి అది మనకు హానినే కలిగిస్తుందని మన సాహిత్యం ప్రబోధిస్తున్నది.

## 4. ఆత్మగుణాలు :

ప్రతి మానవునిలోను శరీరం, బుద్ధి, ఆత్మ అని మూడు భాగాలున్నాయి. అందరికీ కనబడేది శరీరం. ప్రవృత్తిని బట్టి అంచనా వేయబడేది బుద్ధి. ఈ రెంటినీ నడిపేది నిత్యమైనది ఆత్మ. కొందరు శరీరబలాన్ని

సంపాదించి ఫహిల్వాన్లుగా రూపొందుతారు. కాని ఆత్మకు గల సంస్కారాన్ని పెంచుకుంటూ ఆత్మగుణాలను అభివృద్ధి చేసుకుంటూ పవిత్రమైన జీవితాన్ని గడిపేవారు చాలా కొద్దిమంది. అటువంటి మహాత్ముల కుండే గుణాలను ఎనిమిదిగా గుర్తించారు. వాటి స్వరూపాన్ని గురించి ఇక్కడ సంగ్రహంగా తెలుసుకుందాం.

### 4.1 దయ :

కఠినంగా వ్యవహరించడానికి క్రూరంగా ప్రవర్తించడానికి మానవుడే అక్కఱలేదు. ఆ పని చేయడానికి సృష్టిలో ఎన్నో ఘాతుక మృగాలు న్నాయి. నిండైన మానవుడుగా పుట్టి తోటివారి విషయంలో దయతో మెసలక పోవడం మహాపాపం. అసలు ఈ లోకంలో గొప్ప ధర్మమేమి టని యక్షుడు ప్రశ్నించినప్పుడు ధర్మరాజు 'దయ' అని సమాధానం ఇలా చెప్పాడు --

అనృశంస్యం పరో ధర్మః త్రయీ ధర్మః సదాఫలః।
మనో యమ్య న శోచంతి సద్భిః సంధిర్న జీర్యతే॥
(మ. భా. వన. 313.30)

మనసారా ఇతరులపై దయ చూపనివాడు ఎన్ని ధర్మాలు చేసినా అవి బూడిదలో పోసిన పన్నీరే. కనుక జీవులందటిపైన ఎప్పుడూ దయతో ఉండటం మహాత్ముని మొదటి లక్షణం. అందుకే "దయగల హృదయమే దైవమందిర"మని పెద్దలంటారు.

### 4.2. ఓర్పు :

మహాత్ములలో ఉండే రెండో గుణం క్షమ. అంటే ఓర్పు. శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, ఆకలిదప్పులు మొ॥ జంటలను సహించి ఉండటాన్నే క్షమ అంటారు. ఓర్పులేనివాడు సమాజానికి చాలా బరువుగా తయారవుతాడు.

ఏ పనిని సాధించలేదు. నేర్పుతో ఓర్పుతో ప్రయత్నించి సాధించినప్పుడే కార్యసిద్ధి కలుగుతుంది. యక్షుడికి ధర్మరాజు చెప్పిన సమాధానంలో క్షమ ఇలా అభివర్ణింపబడింది --

తపః స్వధర్మవర్తిత్వం మనసో దమనం దమః।
క్షమా ద్వంద్వసహిష్ణుత్వం హ్రీరకార్యనివర్తనమ్॥

(మ. భా. వన. 313.42)

ఆ యా కాలాల్లో సంభవించే ద్వంద్వాలను సహించగలగడమే క్షమ. అభ్యుదయపథంలో ఉన్న ప్రతివ్యక్తికీ ఇది చాలా అవసరం.

ఎందఱు దుర్జనులు చుట్టుముట్టినా క్షమ అనే ఖడ్గాన్ని ధరించినవాణ్ణి ఏమీ చేయలేరని పెద్దలిలా చెబుతారు --

క్షమా ఖడ్గః కరే యస్య దుర్జనః కిం కరిష్యతి?
అతృణే పతితో వహ్నిః స్వయమేవోపశామ్యతి॥

గడ్డి లేనిచోట పడిన నిప్పు దానంతట అదే చల్లారిపోయినట్లు క్షమావంతుడిపైన ఇతరులెంత దౌర్జన్యం చేసినా ఏమీ జరగదు.

### 4.3. అనసూయ :

ఇతరుల అభ్యుదయాన్ని చూసి ప్రతివాడు తనకు లేదే అని అసూయపడతాడు. కాని మహాత్ముడు ఇతరులకు కలిగిన మంచిని తనకు కలిగినట్లు భావించి సంతోషపడతాడు. అసూయలేకపోవడమే అనసూయ. అసూయలేనివాడు ఎలాంటి కష్టాన్ని పొందకుండా ఎప్పుడూ ఆనందంతో ప్రకాశిస్తూ ఉంటాడని విదురుని ఉపదేశం.

అనసూయః కృతప్రజ్ఞః శోభనాన్యాచరన్ సదా।
న కృచ్ఛ్రం మహదాప్నోతి సర్వత్ర చ విరోచతే॥

(వి. నీ. 3.64)

ఇలా అసూయపడకుండా ఉండటం మహాత్ములలో కనపడే అపురూపమైన గుణం. ప్రయత్నపూర్వకంగా దాన్ని సాధించుకోవాలి. అసూయారహితుడైన వ్యక్తి ఆనందానికి ప్రతీకగా కనబడతాడు.

## 4.4 శుభ్రత :

పరిశుభ్రత ఆకర్షణకు మూలకారణం. ఎంత గొప్పవాడైనా అపరిశుభ్రంగా ఉంటే సమాజం అతణ్ణి గౌరవించదు. అంతశ్శుద్ధితో పాటు బాహ్యశుద్ధికూడా చాలా అవసరం. ఆచారాలు వెర్రితలలు వేయనంతవఱకు శుచిగా ఉండటం అవసరమే. తలపనిచేయించుకోకుండా, స్నానమైనా చేయకుండా మురికి బట్టలతో తిరిగే వాడిని పతివ్రతలు కూడా ఎంతటి ప్రియుడైనా ఏవగించుకొంటారని పెద్దలిలా చెబుతారు --

అకృత్తకేశం చాస్నాతం మలోపహతవాససమ్।
అపి ప్రియం జుగుప్సన్తే సుమతేఽపి కులాంగనాః॥

ఇక్కడ కేవలం బాహ్యశుద్ధి చెప్పబడింది. దానితో పాటు అంతశ్శుద్ధి కూడా ఉండటం చాలా అవసరమని పెద్దల మాట.

## 4.5 అనాయాసం :

కొందఱు ప్రతి చిన్న విషయానికి ఆరాటపడతారు. ఆయాసపడతారు. తామెంతో పోగొట్టుకున్నట్లు బాధపడతారు. తమకు కలిగిన కొద్ది దుఃఖానికి లోకంలో ఎవరూ ఏమీ పట్టించుకోలేదనుకుంటారు. వీటిని వేటిని పట్టించుకోకుండా ఎలాంటి అలసట లేకుండా సుఖంగా కాలం వెళ్లబుచ్చుతుంటారు సాధువులు.

అనసూయాఽఽర్జవం శౌచం సంతోషః ప్రియవాదితా।
దమః సత్యమనాయాసో న భవన్తి దురాత్మనామ్॥

(వి. నీ. 2.72)

పైగుణాలు దురాత్ములకుండవు.

## 4.6 మంగళకామన :

'నేను సుఖంగా ఉండాల'ని పశువులు పక్షులు కూడా అనుకుంటాయి. కాని నేను మాత్రం కాదు మిగత జీవులందఱు సుఖపడాలని కోరడం నిండైన మానవుడికే సాధ్యం. 'అందఱు సుఖంగా ఉండాలి. అందఱు ఆరోగ్యంగా ఉండాలి. అందఱు అభ్యుదయాలనందుకోవాలి. ఎవ్వరూ దుఃఖపడకూడదు' అని లోకంలో అందఱి మంచిని కోరడం ఒకనాటి భారతీయుల ప్రత్యేక లక్షణం. అది మన తరతరాల వారసత్వం. వినండి పెద్దలమాట --

సర్వేఽత్ర సుఖినస్సన్తు సర్వే సన్తు నిరామయాః।
సర్వే భద్రాణి పశ్యన్తు మా కశ్చిద్దుఃఖభాగ్భవేత్॥

తమ చుట్టూ ఉన్న సమాజం బాగుండాలని ఎప్పుడూ లోకకల్యాణాన్ని సంకల్పించడం మహాత్ముల గుణం. నాకు మాత్రమే మంచి కలగాలి. మిగతా వారందఱు ఏమైపోయినా పరవాలేదనుకోవడం దురాత్ముల స్వభావం.

## 4.7 అకార్పణ్యం :

పిసినిగొట్టుగా జీవితమంతా గడిపి ఎంత ధనాన్ని కూడబెట్టినా ప్రయోజనం లేదు. మితంగా సంపాదించాలి. చేసిన సంపాదనలో మితంగా అనుభవించాలి. కొంత భవిష్యత్తు కోసం జాగ్రత్త చేసుకోవాలి. అంతేగాని లోభితనంతో తను అనుభవించకుండా ఇతరులకు పెట్టకుండా డబ్బును కూడబెట్టకూడదు. ఎందువల్లనంటే ఊహించనిస్థితిలో తప్పని సరిగా ఏదో ఒకరోజు ధనమైనా మానవుణ్ణి వదిలేస్తుంది. లేక మానవుడైనా ధనాన్ని వదిలిపెట్టి వెళ్లిపోతాడు. అందువల్ల కృపణుడుగా బ్రతకగూడదు. కృపావంతుడుగా బ్రతకాలని మహాభారతం ప్రబోధిస్తున్నది.

ధనం వా పురుషో రాజన్ పురుషం వా పునర్ధనమ్।
అవశ్యం ప్రజహాత్యేవ తద్విద్వాన్ కోఽనుసంజ్వరేత్॥

(మ. భా. శాంతి. 104.45)

ధనం శాశ్వతం కాదు అభిమానధనం శాశ్వతం. కొంతవఱకు తను అనుభవించాలి. కొంతకు కొంత ఇతరులకు పంచి ఇచ్చి వాళ్ల అభిమా వాన్ని సంపాదించాలి. మొండివాడుగా తయారుకాకూడదు.

## 4.8 అస్పృహ :

కోరికలే దుఃఖానికి కారణం. కోరికలెంత తగ్గితే అంత మనశ్శాంతి లభిస్తుంది. దైవానుగ్రహంవల్ల లభించిన దాంతో తృప్తిపడి, జీవనాన్ని సాగించడం తనకూ సమాజానికి కూడా మంచిది. కనుక భాగ్యవశాన పొందిన దానితో సంతృప్తి చెందమని భగవంతుడెలా ఉపదేశిస్తున్నాడో చూడండి --

యదృచ్ఛాలాభసంతుష్టః ద్వంద్వాతీతో విమత్సరః।
సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే॥

(భ.గీ. 4.22)

ఇవన్నీ వ్యక్తిని ఉత్తమసంస్కారపూర్ణుడుగా తీర్చిదిద్దటానికుపయోగించే గుణాలు. ఇలాంటి గుణసంపద కలవాణ్ణే మహాత్ముడంటారు.

## 5. సమాజోపయోగి గుణాలు :

తన చుట్టూ ఉన్న సమాజంలో పాలల్లో నీళ్లలాగా తను కూడా ఒక డుగా కలసి మెలసి ఉండాలి. తన జీవితాన్ని సుఖమయం చేసుకుంటూ ఇతరులకు కూడా తన వల్ల అసంతృప్తి లేకుండా ఉండేటట్లు ప్రవర్తించాలి. అలా ఉండగలగాలంటే ప్రతివాడిలో కొన్ని గుణాలు కావాలి. అవి తన మనుగడకోసం కాకపోయినా సమాజగమనానికి చాలా అవసరం. సంఘ జీవిగా ఉన్న మానవుడిలో ఆ గుణగణాలు లేకపోతే అందరిలో కలసి జీవించలేడు. అలాంటి సమాజోపయోగి గుణాలను కూడా సంస్కృత సాహిత్యం చక్కగా ప్రబోధించింది. వాటినిక్కడ సంక్షిప్తంగా అనుశీలిస్తు న్నాను.

## 5.1 మతసహనం :

రుచులు, అభిరుచులు వేరైనట్లే మానవుల మతాలు కూడా వేరు, వేరుగా ఉంటాయి. తన మతమే గొప్పదని, ఇతరుల మతం హీనమైందని కొందఱు మూర్ఖులు వాదిస్తుంటారు. మతాలు వేరువేరుగా ఉన్నా మతి సరిగా ఉంటే భగవంతుడందఱికీ ఒక్కడేనని అర్థమవుతుంది. అందుకే భిన్నత్వంలో ఏకత్వాన్ని భారతీయ వేదాంతం ప్రబోధిస్తుంది.

ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్।
సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి॥

ఆకాశంనుంచి కురిసే వర్షం పొలాలపైన, చెరువుల్లోను, నేలపైన, నదుల్లోను పడుతున్నట్లు మనకనిపిస్తుంది. కానీ ఈ వర్షధారలు చివఱకు ఎక్కడికి వెడతాయి? అలా అలా అన్నీ కలసి సముద్రంలో చేరిపోతాయి. అలాగే మీరు ఏయే దేవతలను పూజించినా, ఆ పూజలన్నీ భగవంతుడికే చెందుతాయి. కాబట్టి మతసహనం మానవులకు ఎంతో అవసరం. మతసహనం ఉన్న సమాజంలో మతకలహాలకు చోటుండదు.

## 5.2 పరోపకారం :

ఇతరులకుపకారం చేయడమే పుణ్యం. ఇతరులను పీడించటంవల్ల పాపమే కలుగుతుంది. ఇదే సకల శాస్త్రసారం. అయినా కొంతమంది ఎప్పుడూ పనిగట్టి ఇతరులపై కక్ష సాధిస్తుంటారు. అటువంటివాడి జన్మ మానవజాతికే కళంకం. వేదాలు, శాస్త్రాలు ఎన్నో ధర్మాలు బోధించినా వాటన్నింటి సారం ఇతరులకు చేతనైనంత ఉపకారం చేయడమే. చూడండి--

శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం శాస్త్రకోటిషు।
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్॥

నీకు ఉపకారం చేయడానికి వీలులేకపోతే చేయలేనని చెప్పాలిగాని ఎప్పుడూ ఇతరులకు అపకారం మాత్రం చేయకూడదు. పరోపకారిని ఈ

సమాజం ఎన్నటికీ మరచిపోదు. నీకు, అపకారం చేసిన వాడికి కూడా నీవు ఉపకారం చేయడానికి సిద్ధంగా ఉండాలి.

మనకీ శరీరాన్ని పరోపకారం చేయడం కోసమే భగవంతుడిచ్చాడు. ఇతరులను హింసించడానికి మాత్రం ఎన్నటికీ కాదు. చూడండి ఎంత మంచి సుభాషితాన్ని సంస్కృతసాహిత్యం అందిస్తున్నదో--

పరోపకారాయ ఫలన్తి వృక్షాః
పరోపకారాయ వహన్తి నద్యః।
పరోపకారాయ చరన్తి గావః
పరోపకారార్థమిదం శరీరమ్॥

చెట్లు ఇతరులకోసమే పండ్లనిస్తున్నాయి. ఒక్క పండు కూడా అవి తినవు. నదులు ఇతరులకోసమే ప్రవహిస్తున్నాయి. ఆవులు ఇతరుల మేలు కోసమే చరిస్తున్నాయి. ఈ శరీరం కూడా ఇతరులకు ఉపకారం చేయడానికే సృష్టించబడింది. ఇతరులను హింసించడానికి ఎన్నటికీ కాదు. ప్రతిక్షణం ప్రతిమానవుడు ఈ విషయాన్ని గుర్తుంచుకోవాలి.

5.3 ఐకమత్యం :

సంఘంలో అందఱు కలసి మెలసి జీవించడం నేర్చుకోవాలి. దాన్నే ఐకమత్యమన్నారు. ఐకమత్యం ఉంటే ఎంతటి కష్టమైన పనినైనా తేలికగా సాధించవచ్చు. విడివిడిగా గడ్డిపరకలు ఏనుగునేమీ చేయలేవుగాని కొన్ని కలిపి మోకుగా తయారైతే మదగజాలను కూడ అవి బంధించగలుగుతాయి. చూడండి --

అల్పానామపి వస్తూనాం సంహతిః కార్యసాధికా।
తృణైర్గుణత్వమాపన్నైః బధ్యన్తే మత్తదన్తినః॥

అలాగే కలియుగంలో మానవులందఱు కలసికట్టుగా పనిచేయడం ఎంతైనా అవసరం. అందఱి శక్తులు ఒకటైతే అసాధ్యమైన పనే ఉండదు.

బియ్యంపైన పొట్టు ఉంటేగాని అది నేలలో మొలకెత్తదు. అది పొట్టే కదా! అని తక్కువగా చూడగూడదు. అది కూడా ఎంతో అవసరమైందే. అందుకే అందటినీ కలుపుకొని పోవాలని సంస్కృతసాహిత్యం ఇలా ఉపదేశిస్తున్నది --

సంహతిః శ్రేయసీ పుంసాం భూయసీ చ కలౌయుగే।
తుషైరపి పరిత్యక్తాః న ప్రరోహంతి తండులాః॥

ఈ లోకంలో దేన్ని తక్కువగా భావించకూడదు. ఎంత పనికి రాని వస్తువుతోనైనా ఎప్పుడో ఒకప్పుడు పని ఏర్పడవచ్చు.

## 5.4 ప్రియభాషణం :

కఠినంగా మాట్లాడి ఇతరుల మనసు కష్టపెట్టకూడదు. తొందరపాటులో ఆవేశంలో మనం మాట్లాడే మాటలు ఇతరులను ఎంతకాలం బాధపెడతాయో మనమూహించలేము. కొంతమంది మాటలు తూటాల్లాగా తోటివారిని వేధిస్తాయి. వారి హృదయాలకు తూట్లు పొడుస్తాయి. ఇంకొంతమంది మాటలు అమృతపు ఊటల్లాగా పదికాలాలపాటు మధుర స్మృతుల్లో మిగిలిపోతాయి. అందుకనే ఎంత కఠినమైన విషయాన్నైనా ప్రియభాషణంతో ఇతరులకు చెప్పగల్గటం గొప్ప నేర్పు. అది అందటికీ ఉండదు. ప్రియంగా మాట్లాడటాన్ని పెద్దలెలా ప్రశంసిస్తున్నారో చూడండి--

న తథా శశీ న సలిలం
న చందనరసో న శీతలచ్ఛాయా।
ప్రహ్లాదయతి హి పురుషం
యథా మధురభాషిణీ వాణీ॥ (ఆర్యా. 12)

చంద్రుడు, చల్లని నీళ్లు, చందనరసం, చల్లని నీడ, మానవుణ్ణి ఆనందపరుస్తాయి. నిజమే! కాని అంతకంటే మధుర మాధురమైన భాషణం

ఎంతో సంతోషపరుస్తుంది. బాధలన్నింటినీ ఒక్క క్షణంలో పోగొడ్తుంది. మైమరపిస్తుంది.

ప్రియంగా మాట్లాడితే అందఱు సంతోషిస్తారు. నాలుగు మాటలు తియ్యగా చల్లగా మాట్లాడితే నీదేం పోయింది? మృదువుగా మధురంగా మాట్లాడమని ఈ సుభాషితం బోధిస్తున్నది.

ప్రియవాక్యప్రదానేన సర్వే తుష్యంతి జన్తవః।
తస్మాత్తదేవ కర్తవ్యం వచనే కా దరిద్రతా॥

మరీ కఠినంగా మాట్లాడి మనసులు నొప్పించడం కంటే హితంగా మితంగా ప్రియంగా మాట్లాడటంలో ఎంతో అందం ఉంది. అందఱికీ ఆనందం కూడా ఉంటుంది.

## 5.5 సత్సంగం :

సంగం మంచిది కాదు. కాని సత్సంగం మంచిది. మహాత్ములతో సంబంధం మంచికి మార్గమవుతుంది. భౌతిక విషయాలకోసం కాకుండా ఆధ్యాత్మిక తత్త్వ విచారణ కోసం, జ్ఞాన సముపార్జన కోసం పెద్దల నాశ్రయించడం వారి ద్వారా ఆత్మోన్నతికి కావలసిన విశేషాలను తెలుసుకోవడం చాలా మంచిదని మన సాహిత్యం చెపుతున్నది.

సత్సంగకల్పవృక్షోఽసౌ సర్వాభీష్టఫలప్రదః।
సువాక్యామృతవర్షేణ త్రీంస్తాపాన్ హరతే క్షణాత్॥

సత్సంగం కల్పవృక్షం లాంటిది. ఇది ఐహిక ఆముష్మికాభీష్టాలను సాధించిపెడుతుంది. మహాత్ములుపదేశించిన మంచిమాటలనే అమృత వృష్టితో మనలోని తాపాలన్నింటిని ఒక్క క్షణంలో మటుమాయం చేస్తుంది. అందుకని ప్రతివాడికి సత్సంగం చాలా అవసరం.

మహాజనుల సంపర్కంవల్ల ప్రతివానికి అభ్యుదయం కలుగుతుంది. కేవలం నీటిబొట్టైనా తామరాకుపై నున్నప్పుడు ముత్యంలాగా ప్రకాశిస్తుంది.

మహాజనస్య సంపర్కః కస్య నోన్నతికారకః।
పద్మపత్రస్థితం తోయం ధత్తే ముక్తాఫలశ్రియమ్॥

అందువల్ల మహాత్ములతో పరిచయం పెంచుకొని వారిని అనుసరించి ఉండటం చాలా అవసరమని పెద్దలమాట.

కీటోఽపి సుమనస్సంగాదారోహతి సతాం శిరః।
అశ్మాపి యాతి దేవత్వం మహద్భిః సుప్రతిష్ఠితః

పూలతో చేరడం వల్ల చీమ కూడా మహాత్ముల శిరస్సుపైకి ఎక్క గలుగుతున్నది. పెద్దలచేత ప్రతిష్ఠింపబడితే రాయి కూడా దైవభావాన్ని పొందుతున్నది.

## 5.6 దూరదృష్టి :

కొందరికి ముందు చూపు శూన్యం. ఎప్పటి విషయం అప్పుడు ఆలోచించుకుంటే పోలేదా? అని వారి ఆలోచన. కాని దానివల్ల ఉన్నట్టుండి ప్రమాదాల్లో చిక్కుకుంటారు. అందువల్ల దూరదృష్టితో రాబోయే ఆపదలను ఊహించి వాటి ప్రతిక్రియలను సిద్ధం చేసుకోమంటుంది ఇలా సంస్కృతసాహిత్యం --

చింతనీయా హి విపదామాదావేవ ప్రతిక్రియాః।
న కూపఖననం యుక్తం ప్రదీప్తే వహ్నినా గృహే॥

నిప్పుపడి ఇల్లు తగలబడి పోతుంటే "పార పలుగు తీసుకు రండి బావి తవ్వుదాం, నీళ్లు పడితే ఇంటి మంటలు ఆర్పవచ్చు" ననడం ఎంత అవివేకమో ఆలోచించండి. అందుకని ముందు జాగ్రత్త అన్నింట్లోను అవసరమే.

## 5.7 మనోవిగ్రహం :

మనస్సును నిగ్రహించనివాడు సమాజంలో వచ్చే ఒడుదుడుకుల్ని తట్టుకోలేడు. మనస్సును నిగ్రహించిన వాడి ప్రవృత్తి లోకానికి ఉద్వేగం కలిగించదు. అలాగే లోకంలోని పరిస్థితులకు అతడు కూడా ఉద్వేగాన్ని పొందదు. వాడికి హర్షం, కోపం, భయం, ఉద్వేగం ఇలాంటివేవీ ఉండవు. అటువంటి భక్తుణ్ణే భగవంతుడు ప్రేమించేదని భగవద్గీత ఇలా బోధిస్తుంది--

యస్మాన్నోద్విజతే లోకః లోకాన్నోద్విజతే చ యః।
హర్షామర్షభయోద్వేగైః ముక్తో యస్స చ మే ప్రియః॥
(భ. గీ. 12.15)

సమాజంలో పదిమందితో కలసి పనిచేసేటప్పుడు ప్రతివాడికి మనోనిగ్రహం తప్పకుండా ఉండాలి.

## 6. మానవత్వపు విలువలు :

"జన్తూనాం నరజన్మ దుర్లభం" అన్నారు పెద్దలు. ఎన్నో జన్మల తపఃఫలం వల్లనే మనకు మానవజన్మ లభిస్తుంది. అది రాకముందు దాని కోసం తపించిన జీవుడు అది లభించిన తరువాత దాన్ని వ్యర్థంచేసుకొని పరితపిస్తుంటాడు. మరి మానవత్వం సార్థకం కావాలంటే ఏంచేయాలి? ప్రత్యేకంగా ఏమీ చేయనక్కఱలేదు. దాని విలువను పెంచేటట్లు ప్రవర్తించాలి. అంటే సత్య ధర్మ శాంతి ప్రేమ అహింసలనే అయిదింటిని బాగా తెలుసుకొని తన జీవితంలో పాటించాలి. వాటిని పాటిస్తే మానవత్వానికి అందం పెరుగుతుంది. జీవితంలో ఆనందం వెల్లివిరుస్తుంది. అందుకే సత్య ధర్మ శాంతి ప్రేమాహింసలను మానవత్వపు విలువలు అన్నారు. వీటిని సంస్కృతసాహిత్యం ఎంతో చక్కగా ఉపదేశించింది. చూడండి --

## 6.1 సత్యపాలన :

సత్యాన్ని పరిపాలించడం చాలా కష్టమైన పని. ఎన్నో మాటలు చెప్పొచ్చు కాని చెప్పింది చేయడం అంత తేలిక కాదు. అదొక

అసిధారావ్రతం. అందులో నెగ్గినవాళ్లు ఈ సృష్టిలోనే చాలా కొద్దిమంది. సత్యమంటే భగవంతుడు. సత్యంలోనే ధర్మం ప్రతిష్ఠించబడి ఉంది. అక్షయమైన వేదరాశి సత్యస్వరూపమైంది. సత్యం వల్లనే పరలోకాలు సిద్ధిస్తాయి. కనుక సత్యాన్ని ఆరాధించండని రామాయణం ద్వారా వాల్మీకి అందించిన వాగ్రత్నాన్ని పరిశీలించండి --

సత్యమేకపదం బ్రహ్మ సత్యే ధర్మః ప్రతిష్ఠితః।
సత్యమేవాక్షయా వేదా స్సత్యేనైవాఽఽప్యతే పరమ్॥

(వా. రా. అ. 14--7)

ఇంత వేగంగా తిరిగే భూమి ఇలా నిలుస్తున్నదంటే సత్యమే దానికి కారణం. సూర్యుడు క్రమం తప్పకుండా ఇలా ప్రకాశించడానికి సత్యమే కారణం. వాయువు ఇలా వీచడానికి సత్యమొక్కటే మూలం. ప్రపంచగమనమంతా సత్యంలోనే రూపుదిద్దుకొంటున్నదని పెద్దలమాట.

సత్యేన ధార్యతే పృథ్వీ సత్యేన తపతే రవిః।
సత్యేన వాతి వాయుశ్చ సర్వం సత్యే ప్రతిష్ఠితమ్॥

న సా సభా యత్ర న సన్తి వృద్ధా
న తే వృద్ధా యే న వదన్తి ధర్మమ్।
నాసౌ ధర్మో యత్ర న సత్యమస్తి
న తత్సత్యం యచ్ఛలేనాభ్యుపేతమ్॥

(వి. నీ. 3.57)

విదురనీతిలో వృద్ధులు లేనిది సభకాదని, ధర్మం చెప్పలేకపోతే వాళ్లు వృద్ధులే కారని, ఎందులో సత్యముండదో అది ధర్మం కాదని, ఛలంతో అంగీకరించబడింది సత్యం కాదని నిరూపించబడింది. అందువల్ల సత్యస్వరూపాన్ని బాగా తెలుసుకొని దాన్ని పరిపాలించాలి. సత్యరహితమైన ఏ పనైనా వ్యర్థమే అవుతుంది.

## 6.2 ధర్మనిష్ఠ :

ధర్మమనే పదానికి వ్యవహారంలో అనేకార్థాలు చెప్పాల్సి వస్తుంది. ప్రకరణాన్ని బట్టి అర్థభేదం సంభవిస్తుంది. ఇక్కడ లోకవ్యవస్థ దెబ్బతినకుండా ప్రతివాడు అనుసరించాల్సిన సామాన్య నియమమనే అర్థం చెప్పుకుంటే సరిపోతుంది. సమాజాన్ని చక్కజేసే ధర్మాలను ఎవ్వరూ అతిక్రమించ కూడదు. అలా అతిక్రమిస్తే సమాజగమనం దెబ్బతింటుంది. అందుకనే పెద్దలిలా అంటారు.

ధారణాద్ధర్మ ఇత్యాహుః ధర్మో ధారయతే ప్రజాః।
యత్స్యాద్ధారణసంయుక్తః స ధర్మ ఇతి నిశ్చయః॥

పశువులు, పక్షులు, చీమలు, దోమలు, చివరకు ఘాతుక మృగాలు కూడా వాటి వాటి సహజధర్మాన్ని ఎప్పుడూ తప్పటానికి ప్రయత్నించవు. ధర్మనిష్ఠ లేనివాడు, ధర్మాన్ని అతిక్రమించేవాడు మానవుడు మాత్రమే. అందుకే మానవుడికే ధర్మోపదేశం చేస్తున్నాయి శాస్త్రాలు.

ఇప్పుడే ధర్మం ఆచరించాల్సిన పనేముంది? ఎప్పుడో వృద్ధాప్యంలో చూద్దాంలే అనుకొంటారు కొందరు యువకులు. కానీ అది పొరబాటంటున్నదీ సుభాషితం --

యువైవ ధర్మశీలః స్యాదనిత్యం ఖలు జీవితమ్।
కో హి జానాతి కస్యాద్య మృత్యుకాలో భవేదితి॥

అందరికీ తెలియని రహస్యం ఒకే ఒకటుంది. అది వారి మరణ రహస్యం. ఎవరు ఎప్పుడు పోతారో ఎవ్వరికీ తెలియదు. అలాంటప్పుడు ఎప్పుడో ముసలితనం వచ్చిన తరువాత ధర్మమాచరించవచ్చులే! అనుకోవడం ఎంత పొరపాటో ఆలోచించండి. ఇప్పుడే శరీరం దృఢంగా ఉన్న దశలోనే ధర్మబద్ధమైన జీవితం గడిపితీరాలి. అప్పుడే మానవత్వం వికసిస్తుంది.

## 6.3 శాంతి :

ప్రపంచంలో ఎవడూ డబ్బు పెట్టి కొనలేనిది శాంతి. దాన్ని సాధనచేసి సంపాదించుకోవాలేగాని ఊరికే లభించదు. లోకంలో ఉన్న పదార్థాలలో అతివిలువైనది కూడా శాంతి ఒక్కటే. అహంకారం, రాగం ఉన్నంతవఱకు ఎవ్వరికీ శాంతిలభించదు. ఆ రెండు పోతేనే శాంతి లభించేది. అందుకే మన వాఙ్మయంలో మోక్షద్వారంలో మొదటి ద్వారపాలకుడుగా శమం పేర్కొనబడింది. శమం ఏర్పడితేనే గాని శాంతి లభించదు.

మోక్షద్వారే ద్వారపాలాశ్చత్వారః పరికీర్తితాః।
శమో విచారస్సంతోషశ్చతుర్థః సాధుసంగమః॥

ఉపనిషత్తులను పఠించే ముందు తరువాత గూడ శాంతిపాఠం చెబుతారు. అహంకారం వల్ల రాగద్వేషాలవల్ల రెచ్చిపోయినవారు సాత్త్వికులను వారి ధార్మికజీవనాన్ని ఇబ్బందిపెట్టకుండా ప్రపంచమంతా ప్రశాంతితో ఉండాలని ప్రసన్నమనస్కులై ప్రజలుండాలని ఉపనిషత్తులు ఆకాంక్షిస్తున్నాయి.

## 6.4 ప్రేమ :

మానవుడికున్న ఒక అపురూపమైన విలువ ప్రేమ. నిస్స్వార్థంగా ఇతరులను ప్రేమించడం. అది ఎప్పుడు కుదురుతుంది? ఉదాత్తమైన సంస్కారం అతడికున్నప్పుడు. ప్రపంచమంతా భగవన్మయంగా కనబడినప్పుడు.

ఏదో స్వార్థంతో ఇతరులపై ప్రేమనటించటం చాలామందిలో కనబడుతుంది. కాని దివ్యమైన ప్రేమ నిర్వ్యాజమైన ప్రేమ కావాలి. అణువణువునా భగవంతుడున్నాడనే భావన స్థిరపడితేనే గాని ఇలాంటి ప్రేమ కలుగదు. అందుకే ఉపనిషత్తులిలా ఉద్ఘోషిస్తున్నాయి --

"రసో వై సః రసగ్గేహ్యేవాయం లబ్ధ్వా ఆనందీ భవతి"

భగవంతుడు రసస్వరూపి. అంటే ప్రేమస్వరూపి. ఆయన మాట ప్రేమ, ఆయన బాట ప్రేమ. ఆయనే ప్రేమ.

## 6.5 అహింస :

అహింసకు పుట్టిల్లు భారతదేశం. అహింసకు వారసులు భారతీయులు. ఈ గడ్డపై పుట్టిన ప్రతివాడికి అంతరంగంలో ఏదో ఒక మూల అహింసా భావన ఉండి తీరుతుంది. త్రికరణశుద్ధిగా ఏ జీవికి హాని తలపెట్టకపోవడమే అహింస అని మహర్షుల అభిప్రాయం.

కర్మణా మనసా వాచా సర్వభూతేషు సర్వదా।
అక్లేశజననం ప్రోక్తా త్వహింసా పరమర్షిభిః॥

క్రియలో మాత్రం కాకుండా మాటలతో గాని, మనసులో గాని ఎవరికీ హాని తలపెట్టకూడదని ప్రాచీన భారతీయులు నమ్మారు. అలా అహింసను సాధన చేయగలిగినవాడు అమృతత్వాన్ని పొందుతాడు. అంతే కాదు అహింసావ్రతంలో సిద్ధి పొందినవాడి చుట్టూ ఉన్న ఘాతుకమృగాలు కూడా హింసాస్వభావాన్ని విడనాడుతాయని పతంజలి యోగదర్శనంలో ఇలా అంటున్నాడు --

"అహింసాప్రతిష్ఠాయాం వైరత్యాగః"

ఇంద్రియాణాం నిరోధేన రాగద్వేషక్షయేణ చ।
అహింసయా చ భూతానామమృతత్వాయ కల్పతే॥

ఇంద్రియనిరోధం, రాగద్వేషనాశం, జీవులను హింసించకపోవటం, వీటివల్ల అమృతత్వసిద్ధి కలుగుతుంది.

## 7. దోషదూషణం :

సంస్కృతసాహిత్యంలో మానవకల్యాణానికి కావలసిన అనేక గుణాల స్వరూపం ఎంత చక్కగా వివరించబడిందో అంతకంటే చక్కగా మానవా

భ్యుదయనిరోధకాలైన దోషాల ఖండనం కూడా దొరుకుతున్నది. ప్రాచీన భారతీయులు ఆ దోషాలను ఖండించి వీటిని మీదగ్గఱకు కూడా రానీయ వద్దని మనల్ని హెచ్చరిస్తున్నారు. అందులో కొన్ని దోషాలను మాత్రం ఇక్కడ సంగ్రహంగా పేర్కొంటున్నాను.

### 7.1 చాంచల్యం :

చాలామందికి మనస్సు స్థిరంగా నిలబడదు. అతి చంచలంగా ఉంటుంది. అలాంటి మనస్సుతో వారుఎన్నో అవస్థలు పడుతుంటారు. కాని ఇలాంటి మనశ్చాంచల్యం కలవాళ్లు తమకు ఉపయోగపడరు. లోకానికీ ఉపయోగించరు. కనుక అలాంటి మనస్సును ప్రయత్నపూర్వకంగా నిగ్రహించాలి.

చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్।
తస్యాఽహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్॥

(భ. గీ. 6.34)

మానవుని మనస్సు అతణ్ణి మథిస్తూ ఉంటుంది. చాలా బలం కలది. దృఢమైనది. కనుకనే అర్జునుడిలా శ్రీకృష్ణునితో అంటున్నాడు. మనస్సు నిగ్రహించడం జంఝూమారుతాన్ని లాగిపట్టడం లాంటిది. అది నిరంతరాభ్యాసంవల్ల కాని సాధ్యం కాదు. చాంచల్యం పోవాలంటే మనస్సును నిగ్రహించాలి.

### 7.2 అసంతృప్తి :

ఉన్నదానిని చూచి తృప్తిపడటం చాలా అవసరం. కాని మానవుడికి దృష్టి తనకున్న దానిమీద కంటే లేని దానిపైనే ఉంటుంది. ఏదో లేదని అసంతృప్తితో బాధపడటం మంచిది కాదు. ఉన్నదాన్ని చూసుకొని తృప్తిగా బ్రతకడం నేర్చుకోవాలి.

అపి చేదుదనేమి సమంతాద్భూమిమిమాం లభతే సగవాశ్వామ్।
న స తేన ధనేన ధనైషీ తృప్యతి కిన్ను సుఖం ధనకామః॥

(న్యా. భా. 4.1.)

సమస్త సంపదలతో ఈ భూమండలాన్నంతా సంపాదించినా ధన కామనగలవాడికి తృప్తి కలగదు. ఇంకా ఏదో సంపాదించాలనే ఆశ మిగిలిపోతుంది. అందువల్ల అశాంతి కలుగుతుంది. కనుక ప్రతివాడు తృప్తిపడటం నేర్చుకోవాలి.

## 7.3 నిరుత్సాహం :

కొందఱు ప్రతిదానికీ "నేనేం చేయగలనండీ! నావల్లేమౌతుందీ" అని ఎంతో నిరుత్సాహం చూపిస్తారు. నిజానికి శక్తి కలవాడు కూడా ఇలా నిరుత్సాహపడితే కొంతకాలానికి దేనికీ పనికిరాకుండా పోతాడు. కనుక అలాంటి నిరుత్సాహాన్ని దగ్గఱకు్కూడా రానీయకూడదు.

ఆత్మవిశ్వాసం పెరగాలేగాని తరగగూడదు. ఆత్మవిశ్వాసం ఉన్న వాళ్లెప్పుడూ నిరుత్సాహానికి గురికారు. పార్థుడు కదనరంగంలో నిరుత్సాహానికి గురైనప్పుడే పార్థసారథి అతణ్ణి ఉత్సాహపరచి విజయుణ్ణి చేసి విజయలక్ష్మి వరించేటట్లు అనుగ్రహించాడు. నిరుత్సాహాన్ని నిర్దాక్షిణ్యంగా పారద్రోలాలి.

## 7.4 సంశయం :

మానవుణ్ణి ముందుకు పోనీయకుండా వెనకకు రానీయకుండా చేసేది సంశయమే. తనపైన తను చేసే పనిమీద విశ్వాసం ఉంటే, తప్పక అతడు విజయం సాధించగలుగుతాడు. అడుగడుగునా సంశయగ్రస్తుడవుతుంటే వినాశాన్ని కోరి తెచ్చుకుంటాడు. అతడికి సుఖం కాని, ఇహపరాలు గాని ఉండవు.

అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి।
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః॥

(భ. గీ.)

కనుక సంశయాన్ని మన మనస్సులోకి రానీయకుండా జాగ్రత్త పడాలి.

## 7.5 భయం :

భయపడేవాడు ఏకార్యాన్నీ సాధించలేడు. నిర్భయంగా రంగంలోకి దూకి ఆత్మవిశ్వాసంతో కార్యాన్ని సాధించాలే గాని భయంతో వణికేవాడికి కార్యసిద్ధి ఎలా కలుగుతుంది? మన అభివృద్ధికి అడ్డుతగిలే ఆరు దోషాల్లో భయం కూడా ఒకటని విదురుని నీతివాక్యం.

షడ్దోషాః పురుషేణేహ హాతవ్యా భూతిమిచ్ఛతా।
నిద్రా తంద్రా భయం క్రోధ ఆలస్యం దీర్ఘసూత్రతా॥
(వి. నీ. 1.83)

కనుక భయాన్ని వదిలి ధైర్యంగా ప్రతిపనిలోను ఉత్సాహంగా పాల్గొని విజయాన్ని సాధించాలని మన వాఙ్మయమిచ్చే సందేశం.

## 7.6 తొందరపాటు :

కొందఱు అతి నిదానంగా పనులు ప్రారంభిస్తారు. మఱి కొందఱు అతి తొందరగా పనులు జరగాలంటారు. ఈ రెండు నిజంగా తప్పులే. అవసర మొచ్చినప్పుడు చాకచక్యంగా పనులు చేయాలి గాని ఆలోచనా రహితంగా తొందరపడి ఏ పనీ చేయకూడదు. భారవి అందుకే ఇలా అంటాడు--

సహసా విదధీత న క్రియాం అవివేకః పరమాపదాం పదమ్।
వృణతే హి విమృశ్యకారిణం గుణలుబ్ధాః స్వయమేవ సంపదః॥
(కిరా. 1)

అవివేకంవల్ల ఆపదలొచ్చి పడతాయి. చక్కగా విమర్శించి కార్య నిర్వహణ చేసే గుణవంతుణ్ణి సంపదలు స్వయంగానే వచ్చి వరిస్తాయి. అందుకని తొందరపాటును తొందరగా వదిలిపెట్టాలి.

### 7.7 పరుషభాషణం :

ఎవ్వరితోను కఠినంగా మాట్లాడకూడదు. మృదువుగా నెమ్మదిగా మాట్లాడాలి. అనవసరమైన వైరాలు పెంచుకొని వివాదాల్లోకి దిగకూడదు. ఎవరేది చెప్పినా ఆవేశపడక 'మంచిది' 'మంచిది' అని మాత్రమే చెప్పాలి. ఇది ఉదాత్తమైన ప్రవర్తనగా పెద్దలు చెబుతారు.

భద్రం భద్రమితి బ్రూయాత్ భద్రమిత్యేవ వా వదేత్।
శుష్కవైరం వివాదం చ న కుర్యాత్కేన చిత్సహ॥

ఇతరులు ఆవేశపడి పరుషంగా మాట్లాడేటప్పుడు మనం కూడా ఆవేశంగా మాట్లాడకూడదు. ఓర్పుతో ఉండటం నేర్చుకోవాలి. పరుష భాషణంవల్ల వైరం ఇంకా ఇంకా పెరుగుతుంది. లేకపోతే మనమే ముందు పరుషంగా మాట్లాడితే మన కార్యమే చెడుతుంది.

### 7.8 కామం :

మానవుడు బాహ్య శత్రువులను జయించటం చాలా తేలిక. కాని అంతశ్శత్రువులను జయించడం కష్టసాధ్యం. మానవునికి గల ఆర్గురు అంత శ్శత్రువులలో మొదటిది కామం. ఈ కాముడు చిత్రవిచిత్రమైన రీతులలో మనల్ని జయించడానికి వలలు పన్నుతాడు. చూడండి --

కామనామ్నా కిరాతేన వికీర్ణా ముగ్ధచేతసః।
నార్యో నరవిహంగానామంగబంధనవాగురాః॥

కాముడనే కిరాతుడు పురుషవిహంగాలను బంధించడానికి పన్నిన రంగులవలలే ఈ సుందరీమణులు. అందువల్ల అటువం వలల్లో చిక్కుకొని చిక్కులు తెచ్చుకోకుండా జాగ్రత్తగా ఉండాలి.

### 7.9 క్రోధం :

క్రోధాగ్ని రగుల్కొన్నదంటే అది దావాగ్నిలా తయారవుతుంది. దాన్ని చల్లార్చడం మానవుల తరం కాదు. అందుకనే అది ఏర్పడకుండానే చూసుకోవాలి గాని తరువాత విచారించి ప్రయోజనం లేదు.

క్రోధః సుదుర్జయః శత్రుః లోభో వ్యాధిరనంతకః।
సర్వభూతహితః సాధురసాధుర్నిర్దయః స్మృతః॥
(మ. భా. వన. 313.46)

క్రోధమనే అంతశ్శత్రువు మనల్నెప్పుడూ రెచ్చగొడుతూనే ఉంటాడు. కాని మనం నిదానంగానే ఉండాలి. రెచ్చిపోతే ఆత్మవినాశం తప్పదు.

## 7.10 లోభం :

లోభం వల్లనే మానవుడు ఇంకా ఇంకా సంపాదించాలని ఎవ్వరికీ ఏమీ ఇవ్వకుండా దాచుకోవాలని ఎన్నో ప్రయత్నాలు చేస్తుంటాడు. ఇదొక వ్యాధిలాంటిది. దీనికి ఏ మందులూ లేవు.

విద్యమానే ధనే లోభాద్దానభోగవివర్జితః।
పశ్చాన్నాస్తీతి యో బ్రూయాత్సోఽక్షయం నరకం వ్రజేత్॥
(మ. భా. వన. 313.60)

డబ్బు ఉండి కూడా ఇతరుల కివ్వకుండా, తాను అనుభవించకుండా కాపలా కాస్తుంటాడు లోభి. తన దగ్గఱ ఉంచుకొని కూడా అవసరమైన వాడొచ్చి అడిగినప్పుడు లేదని చెప్పే లోభికి అక్షయనరకం సంభవిస్తుంది.

## 7.11 మోహం :

ఇది ధర్మమని, కర్తవ్యమని తెలిసికూడా దాన్ని అతిక్రమించడం మోహం. ధర్మవిమూఢస్థితిలో మోహం మొగ్గతొడుగుతుంది. ఒకప్పుడు మోహం వల్ల ఏది ధర్మమో! ఏది అధర్మమో! తెలుసుకోలేని స్థితి కూడా సంభవిస్తుంది.

మోహో హి ధర్మమూఢత్వం మానస్త్వాత్మాభిమానితా।
ధర్మనిష్క్రియతాఽఽలస్యం శోకస్త్వజ్ఞానముచ్యతే॥
(మ. భా. వన. 313.48)

మానవుడు ఎన్నటికీ మోహపరవశుడు కాకూడదు. వివేకంతో ప్రవర్తించాలి. ప్రశాంతంగా ఆలోచించాలి.

## 7.12 మదం :

విద్యామదం, ధనమదం, జనమదమని మదాలు మూడురకాలు. గర్వంతో విర్రవీగే వారికి నాలుగక్షరాలు వస్తే నేను గొప్ప పండితుణ్ణని మదం పెరుగుతుంది. నాలుగు రూపాయలు చేరితే నేనెంతో ధనికుణ్ణని మీసం మెలిపెడతాడు. నేనింత గొప్ప కులంలో పుట్టాననో ఇంతమంది నాకు మద్దతుదార్లు ఉన్నారనో ఎగిరిపడటం అభిజనమదం లేక జనమదం అవుతుంది.

విద్యామదో ధనమదస్తృతీయోఽభిజనో మదః।
మదా ఏతేఽవలిప్తానామేత ఏవ సతాం దమాః॥

(వి. నీ. 2.44)

గర్వితులైన వాళ్లకు ఇవి మదాలైతే సత్పురుషులకు ఇవి దమాలౌతాయి. సత్పురుషులు ఎంత విద్య ఉన్నా, ఎంత ధనం ఉన్నా, ఎంతమంది జనం ఉన్నా నిగ్రహంతోనే ఉంటారు. వారికవి మదాన్ని కలిగించవు.

## 7.13 మాత్సర్యం :

తన కపకారం చేశాడనో, లేక చేస్తాడనో ఎవరితోనో ఒకరితో వైరం పెంచుకొని పగసాధించాలనుకోవడం మాత్సర్యమవుతుంది. ప్రతీకారం చేసే వఱకు నిద్రపట్టకపోవడం ఆతడిని తిరిగి ఎలా దెబ్బ కొడతానా అని ఎదురు చూస్తుండటం మనం కొందఱిలో చూస్తుంటాం. అటువంటివారిని మత్సరులంటారు.

మాత్సర్యంతో మలినమైన మనస్సుకు మంచి చెడ్డలు తోచవు. ఇంకొకరు చెప్పినా నచ్చవు. వివేకం శూన్యమవుతుంది. ఓర్పు పూర్తిగా దిగజారి పోతుంది.

అవతలివాడిని తను ఏమీ చేయలేకపోతే పట్టుదల ఇంకా పెరిగిపోతుంది. ఆవేశం అందలం ఎక్కుతుంది. ఆరోగ్యం నాశనమవుతుంది. చివరకు ఆత్మవినాశం సంభవిస్తుంది.

## 8. మానవతకు మహోపదేశం :

వైదికవాఙ్మయంతో ప్రారంభమైన సంస్కృతసాహిత్యం తరతరాలుగా లోకకల్యాణానికి అంకితమై భారతీయ సంస్కృతిని తీర్చిదిద్దింది. విశ్వ కుటుంబ భావనను మానవజాతిలో కలిగించి సమాజంలో వారి వారి ధర్మాలను వారు నిర్వహిస్తూ సమభావంతో ఆనందమయ జీవితాలను గడపటానికి దోహదంచేసింది. సంస్కృతసాహిత్యం ద్వారా మనజాతికి లభించిన వారసత్వాలు ఎన్నో ఉన్నా అందులో ఆశ్రమధర్మం ఎంతో విశిష్టమైంది.

### 8.1 ఆశ్రమవిభాగం :

ఆశ్రమధర్మ నేపథ్యంలో మానవ జీవితానికి ఇతర దేశాల్లో గాని వారి సంస్కృతుల్లో గాని ఎక్కడా లేనటువంటి భాష్యాన్ని మన సాహిత్యం చెప్పగలిగింది. ప్రతివాడు తన జీవితాన్ని తను చక్కగా అనుభవిస్తూనే సమాజానికి సేవ చేయటానికి ఉపయోగపడేటట్లు ఒక మంచి వ్యవస్థను అభ్యూహించింది. దాని ప్రకారం మానవ జీవితం వయోధర్మాన్ని బట్టి బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసాశ్రమాలని నాలుగు దశలుగా విభజింపబడింది. ప్రతి దశలోను ప్రతి వ్యక్తి తన వ్యక్తిగత బాధ్యతలను సామాజిక బాధ్యతలను నిర్వహిస్తూ జీవితధ్యేయాన్ని సాధించుకోవడానికి కృషి చేసే అవకాశమున్నది.

#### 8.1.1 బ్రహ్మచర్యం :

భారతీయ జీవనవిధానంలో మొదటి ఆశ్రమం బ్రహ్మచర్యం. ఇందులో ఉత్తరజీవితానికి కావలసిన జ్ఞానాన్ని విజ్ఞానాన్ని ప్రతివాడు సంపాదించుకొనే అవకాశం ఉన్నది.

గురుకులంలో కట్టుదిట్టమైన నియమాలతో ప్రతివాడు గురుశుశ్రూష చేస్తూ తనకు కావలసిన విద్యను అధ్యయనం చేస్తాడు. అధ్యయనం పూర్తయిన తరువాత గురువు అనుమతితో బ్రహ్మచారి బ్రహ్మచర్యాశ్రమాన్ని వదలి గృహస్థాశ్రమంలో ప్రవేశిస్తాడు.

### 8.1.2 గార్హస్థ్యం :

ఆశ్రమాలన్నింటిలో గృహస్థాశ్రమం చాలా ముఖ్యమైనది. ఎందువల్లనంటే ఇతరాశ్రమాల్లో ఉన్న వారినందఱిని ఆదరించి, ఆశ్రయమిచ్చి పోషించవలసింది గృహస్థాశ్రమంలో ఉన్నవాళ్లే. చూడండి మహాభారతం ఏమంటున్నదో!

వయాంసి పశవశ్చైవ భూతాని చ జనాధిప।
గృహస్థైరేవ ధార్యంతే తస్మాచ్ఛ్రేష్ఠో గృహాశ్రమీ॥
(మ. భా. శాంతి. 23.5)

పక్షులు, పశువులు, మానవులు గృహస్థులచేతనే పోషింపబడుతున్నారు. కనుక గృహస్థాశ్రమం ఇతర ఆశ్రమాలన్నింటికంటే ముఖ్యమైనది.

### 8.1.3 వానప్రస్థం :

గృహస్థుడు తన ఆశ్రమధర్మాన్ని నిర్వహిస్తూ జుట్టు నెరవడం, చర్మం ముడతలు పడటం మొదలుపెట్టగానే లేదా తన సంతానానికి సంతానం కలగగానే వానప్రస్థాశ్రమాన్ని స్వీకరించాలని మహాభారతం చెబుతున్నది. ఈనాడు వానప్రస్థాశ్రమాన్ని ప్రతివాడు చిన్నచూపు చూస్తున్నాడు. అందువల్లనే ఉమ్మడి కుటుంబాల్లో చాలామందికి మనశ్శాంతి లేదు.

గృహస్థస్తు యదా పశ్యేద్వలీపలితమాత్మనః।
అపత్యస్యైవ చాపత్యం వనమేవ తదాశ్రయేత్॥
(మ. భా. శాంతి. 244.4)

వానప్రస్థుడు రేపటిని గురించి ఆలోచించకూడదు. తేలికైన ఆహారాన్ని నియమంగా తీసుకొంటూ, ఒకే పూట భోజనం చేస్తూ గడపాలి. ఇది సన్న్యాసాశ్రమానికి మొదటి మెట్టులాంటిది. సుమారు 50 సం॥ లొచ్చిన ప్రతివాడూ ఆశ్రయించాల్సిన ఆశ్రమం.

అశ్వస్తన విధాతా స్యాన్మునిర్భావసమాహితః।
లఘ్వాశీ నియతాహారః సకృదన్న నిషేవితా॥

(మ. భా. శాంతి. 246.6)

## 8.1.4 సన్న్యాసం :

ఉత్తమాశ్రమం సన్న్యాసం. ఇది అందరికీ లభించదు. మూడు ఆశ్రమాల్లో బాగా సాధన చేసి సిద్ధిపొందినవాళ్లే దీనికి అర్హులు. ఒక సన్న్యాసి బాగా పరీక్షించి తృప్తిపొందిన తరువాత ఇంకొకడికి సన్న్యాసాన్ని ఇస్తాడు. ప్రపంచమంతా భగవన్మయంగా ఇతడికి కనపడాలి.

యస్మిన్ వాచః ప్రవిశంతి కూపే త్రసా ద్విపా ఇవ।
న వక్తారం పునర్యాంతి స కైవల్యాశ్రమే వసేత్॥

(మ. భా. శాంతి. 245.8)

భయపడిన ఏనుగులు దిగుడుబావిలో పడిపోతాయి. తిరిగి పైకి రాలేవు. అలాగే అవతలవాడు మాట్లాడే మాటలన్నీ వినికూడా ఏరకమైన వికారం పొందకుండా అతడికి ఏమీ సమాధానం చెప్పకుండా ఉండగలిగే వాఙ్నియమం ఉన్నవాడే సన్న్యాసానికి అర్హుడని మహాభారతం విశదపరుస్తున్నది.

నాభినందేత మరణం నాభినందేత జీవితమ్।
కాలమేవ ప్రతీక్షేత నిదేశం భృతకో యథా॥

(మ. భా. శాంతి. 245.75)

సన్న్యాసి మరణాన్ని కోరుకోకూడదు. జీవితాన్ని కోరుకో కూడదు. సేవకుడు యజమాని ఆజ్ఞకోసం ఎదురు చూసినట్లు కాలం కోసం ఎదురుచూస్తూ ఉండాలి.

## 8.2 స్త్రీగౌరవం :

స్త్రీని గౌరవించలేని సమాజం చిరస్థాయిగ నిలవలేదు. భారతీయ సంస్కృతి స్త్రీని మకుటంలేని మహారాణిగా నిలబెట్టింది. స్త్రీని ఒక ఆటబొమ్మగా కాక అత్యున్నత స్థానంలో ఉంచి గౌరవించింది.

యత్ర నార్యస్తు పూజ్యంతే రమన్తే తత్ర దేవతాః।
యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః॥

స్త్రీలెక్కడ పూజింపబడతారో దేవతలక్కడ ఆనందంగా విహరిస్తారు. ఎక్కడ స్త్రీలకు గౌరవముండదో అచట జరిగే పనులన్నీ వ్యర్థమైపోతాయన్నాడు మనువు.

శోచంతి జామయో యత్ర వినశ్యత్యాశు తత్కులమ్।
న శోచంతి తు యత్రైతా వర్ధతే తద్ధి సర్వదా॥

స్త్రీలెక్కడ దుఃఖపడుతుంటారో ఆ కులం త్వరలో నశించిపోతుంది. ఎక్కడ ఏ బాధలు లేక వారు సంతోషంగా ఉంటారో ఆ కులం అభివృద్ధి చెందుతుంది.

తస్మాదేతాః సదా పూజ్యా భూషణాచ్ఛాదనాశనైః।
భూతికామైర్నరైర్నిత్యం సత్కారేషూత్సవేషు చ॥

అన్ని పర్వాల్లోను, పండుగల్లోను అభివృద్ధికి రాదలచినవాళ్లు స్త్రీలను భూషణాలతోను వస్త్రాలతోను తినుబండారాలతోను సంతోషపెట్టాలి. గౌరవించాలి.

## 9. పురుషార్థాలు :

మానవజీవితానికి ఒక పరమార్థం ఉందని, ఎన్నో జన్మల తపఃఫలమే ఈ జీవితమని భారతీయుల విశ్వాసం. ఆ పరమార్థాన్ని సాధించడానికే మన ప్రాచీనులు పురుషార్థభావన చేశారు. ధర్మం, అర్థం, కామం, మోక్షం అనేవి నాలుగు పురుషార్థాలు. పురుషపదానికి స్త్రీపురుష సమానమైన ప్రాణి అని అర్థం. ప్రతిజీవి కోరుకునేది కనుక ఇది పురుషార్థమనబడింది. ఈ నాల్గింటిని దశల వారీగా ప్రతిజీవి కోరుకుంటుంది. అందుకే వీటికీ పేరు వచ్చింది.

### 9.1 ధర్మం :

ధర్మమనేది మొదటి పురుషార్థం. ఎవరి ధర్మాన్ని వారు సక్రమంగా నిర్వహిస్తే సమాజం చక్కగా ఉంటుంది. సమాజం బాగుంటే దేశం బాగుంటుంది.

రాజు ప్రాచీనులాచరించిన ధర్మాన్ని తను ఆచరిస్తూ రాజ్యంలో అందరిచేత ఆచరింపజేస్తే భూమి సస్యశ్యామలమై, సిరిసంపదలతో తులతూగుతుంది.

ధర్మమాచరతో రాజ్ఞః సద్భిశ్చరిత మాదితః।
వసుధా వసుసంపూర్ణా వర్ధతే భూతివర్ధినీ॥

(వి. నీ. 2.20)

మనం ధర్మాన్ని రక్షిస్తే అది మనల్ని రక్షిస్తుంది. మనం ధర్మాన్ని చిన్నచూపు చూస్తే అది కూడా మనల్ని చిన్నచూపే చూస్తుంది.

### 9.2 అర్థం

ధర్మావిరుద్ధమైన మార్గంలో అర్థాన్ని సంపాదించవచ్చు. అర్థపురుషార్థాన్ని ప్రధానంగా పెట్టుకోకూడదు. అందుకే ధర్మానికి మోక్షానికి మధ్య

అర్థకామాలనే పురుషార్థాలను చేర్చారు. ధర్మాన్ని అతిక్రమించని అర్థకామాలు ఎన్నటికీ హాని చేయవు. ధర్మాతిక్రమణం జరిగితే అవే ప్రతిబంధకాలౌతాయి.

యస్యార్థాస్తస్య మిత్రాణి యస్యార్థాస్తస్య బాంధవాః।
యస్యార్థాస్స పుమాన్ లోకే యస్యార్థాస్స చ పండితః॥
(వా. రా. యు. 83.35)

వాల్మీకి ఇలా చెబుతున్నాడు -- అర్థసిద్ధి పొందిన వాడికే మిత్రులు, బంధువులు, చేరువౌతారు. వాడే పురుషుడుగా చలామణి అవుతాడు. వాడే పండితుడుగా గుర్తింపు పొందుతాడు. కనుక అర్థాన్ని సంపాదించాల్సిందే. కాని ధర్మవిరుద్ధంగా మాత్రం కాదు.

9.3 కామం :

భారతీయులకు లౌకిక సుఖాలననుభవించడం తెలియదని కొందరు పాశ్చాత్యులు విమర్శిస్తుంటారు. అది పొరపాటు. లౌకికజీవితాన్ని వ్యక్తిగతం గాను, సామాజికంగాను బాగా తీర్చిదిద్దుకున్నది భారతీయులు మాత్రమే. ధర్మావిరుద్ధమైన కామాన్ని అనుభవించడానికి మన సాహిత్యం ఎప్పుడూ అడ్డు చెప్పలేదు! ధర్మవిరుద్ధమైతే పనికిరాదని చెప్పిన మాట నిజం. ధార్మికమైన కోరికలను తీర్చుకోవడానికి భారతీయ సంస్కృతి ఎప్పుడో అనుమతించింది.

యదా ధర్మశ్చ భార్యా చ పరస్పరవశానుగౌ।
తదా ధర్మార్థకామానాం త్రయాణామపి సంగమః॥
(మ. భా. వన. 313. 56)

యజమానికి ధర్మంతో పాటు భార్య కూడ ఎప్పుడు వశవర్తినిగా ఉంటుందో అప్పుడు ధర్మం, అర్థం, కామం అనే మూడు పురుషార్థాల సంగమం ఏర్పడుతుందని మహాభారతం చెబుతున్నది.

## 9.4 మోక్షం :

నాల్గవ పురుషార్థం మోక్షం. ధర్మార్థకామాలనే మూడు పురుషార్థాల్లో సిద్ధిని సంపాదించినవాడు మోక్షాన్ని సంపాదించడానికి అర్హుడౌతాడు. భారతీయ జీవనవిధానానికి అంతిమ లక్ష్యం మోక్షమే. దుర్లభమైన నరజన్మ పొందినవాడు సంపాదించదగింది మోక్షమేనని భారతీయ తత్త్వశాస్త్రం ప్రతిపాదిస్తున్నది.

### 9.4.1 శరణాగతి :

"నీవే తప్ప నితః పరం బెరుగ"ననే స్థితి శరణాగతి. కర్మవల్ల గాని, జ్ఞానంవల్ల కాని, భక్తివల్ల గాని మోక్షాన్ని సంపాదించడం కష్టసాధ్యం. అందుకనే సులభోపాయం శరణాగతిగా పెద్దలు చెబుతున్నారు.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః.
(భ. గీ. 18.66)

ఏది ధర్మమో ఏది అధర్మమో తెలుసుకోవడం చాలా కష్టం. కనుక అన్ని ధర్మాలను తనకే వదలి తనను శరణు వేడటం సులభతరమార్గమనే ఆ స్వామి మనకుపదేశిస్తున్నాడు. తనే అన్ని పాపాలనుంచి దాటించి మోక్షమిస్తానంటున్నాడు.

## 10. జీవితధ్యేయం :

మానవజీవితానికి లక్ష్యమేమిటి? తను ఆదర్శంగా ఉండి ఉన్నతమైన సంస్కారంతో ఇతరులకు మార్గదర్శకంగా ఉదాత్తమైన జీవితాన్ని ఈ లోకంలో గడిపి పరమపదాన్ని చేరడం. ఆదర్శమైన జీవితమిలా ఉండాలని బృహత్సన్న్యాసోపనిషత్ ఇలా బోధిస్తున్నది --

యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే।
యః సమః సర్వభూతేషు జీవితం తస్య శోభతే॥

(బృ. స. డ. 45)

అహంకారం, గర్వం లేకుండా ప్రాణులందరిపైన సమభావనతో ఎవరు జీవిస్తారో అలాంటి జీవితమే బాగా శోభిస్తుంది. పదిమందికి ఆదర్శ మౌతుంది.

## 10.1 ఆదర్శజీవనం :

మనమెందుకు ఆదర్శమైన జీవితం గడపాలి? పదిమంది మన జీవితాన్ని అనుకరిస్తారు కాబట్టి. కనుక పొరపాటు రాకుండా జాగ్రత్త పడాలని భగవాన్ ఇలా ఉపదేశిస్తున్నారు.

యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః।
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే॥

(భ. గీ. 3.21.)

ఉత్తముడెలా జీవితం గడిపాడో చూచి మిగతావాళ్ళు కూడా అలాగే నడచుకుంటారు. అతడు దేన్ని ప్రమాణంగా తీసుకుంటాడో లోకం కూడా దాన్నే అనువర్తిస్తుంది. అందుకే ఆదర్శంగా జీవించటానికి ప్రయత్నించాలి.

సర్వభూతేషు కారుణ్యం ప్రియభాషణమేవ చ।
సర్వభూతహితే శ్రద్ధా సాక్షాత్ భక్తి శ్శివస్య తు॥

అన్ని ప్రాణులపైన దయ, ప్రియంగా మధురంగా సంభాషించడం, జీవులందరికీ మంచి కలగజేయడంలో శ్రద్ధ, భగవంతునిపై శ్రద్ధ, ఇవి ఆదర్శజీవనానికి గీటురాళ్ళు. నిజమైన మానవత్వం అలాంటప్పుడే వికసిస్తుంది.

తుల్యే ప్రియాప్రియే యస్య సుఖదుఃఖే తథైవ చ।
అతీతానాగతే చోభే స వై సర్వధనీ నరః॥ (మ. భా. వన. 313-74)

ఎవరికి ప్రియాప్రియాలు, సుఖదుఃఖాలు, భూతభవిష్యత్కాలాలు సమంగా ఉంటాయో అతడే సర్వధని అయిన మానవుడు. మంచి చెడ్డలను సమానంగా తీసుకోగల్గటమే నిజమైన ఆదర్శమని మహాభారత మహోపదేశం.

## 11. నిత్యసత్యాలు :

త్రికాలాబాధితాలైన సత్యాలు కొన్ని నిత్యమైన విలువగలవి సంస్కృత సాహిత్యంలో దొరుకుతున్నాయి. అవి భారతీయ తత్త్వ శాస్త్రం నిగ్గుతేల్చిన అంశాలు. భారతీయులకు లౌకిక జీవనం వేరు ఆధ్యాత్మిక జీవనం వేరు కాదు. లౌకిక జీవనాన్ని అనుభవిస్తూనే ఆధ్యాత్మికతకు లోటుతాకుండా జీవితాన్ని మలచుకోవచ్చు. అయితే ప్రపంచంలోని కొన్ని విషయాలపైన సరైన అవగాహన కావాలి. దేశ-కాల-పాత్రలు మారినా మార్పులేని ఆ తత్త్వాలను కొన్నింటిని సంస్కృత సాహితి చక్కగా విశ్లేషించింది. ఇక్కడ కొన్నింటిని గూర్చి సంగ్రహంగా తెలుసుకుందాం!

### 11.1 ద్వంద్వాలు :

శీతోష్ణాలు, సుఖ దుఃఖాలు, చీకటి వెలుగులు ఇవన్నీ ద్వంద్వాలు. అంటే జంటలు. కొన్నాళ్ళు ఒకదాని వల్ల సుఖం, ఇంకొన్ని రోజులు ఇంకో దానివల్ల దుఃఖం. వీటినెలా తట్టుకోవడం? అంటే భగవద్గీతలో పార్థసారథి ఇలా ప్రబోధిస్తున్నాడు --

మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ! శీతోష్ణ సుఖదుఃఖదాః।
ఆగమాపాయినోऽనిత్యా స్తాం తితిక్షస్వ భారత॥

(భ. గీ. 2.14)

ఇవన్నీ శాశ్వతంగా అలాగే ఉండవు. తాత్కాలికాలు. ఇవి ఎవరికీ తప్పవు. కాబట్టి వీటి ప్రభావం నీ మనస్సు మీద పడకుండా ఓర్పును

పెంచుకొని ప్రవర్తించు. సహనం ఎంత పెరిగితే వాటి బాధ అంతగా తగ్గుతుంది. గాలిలో మేఘాల్లాగా అవే కదలిపోతాయి. మనోనిగ్రహమొక్కటే ఇక్కడ సాధన మార్గం.

## 11.1.1 సంయోగ-వియోగాలు :

'నా భార్య, నా పిల్లలు, నా బంధువులు, నా ఆస్తిపాస్తులు' అని మానవుడు మమకారం పెంచుకొని అవస్థలు కొనితెచ్చుకుంటున్నాడు. నిజానికి ఇవన్నీ మనం కల్పించుకున్నవే గాని ఇందులో సత్యం కొంచెం కూడా లేదు. వినండి రామాయణంలో శ్రీరామచంద్రుని సందేశం --

యథా కాష్ఠం చ కాష్ఠం చ సమేయాతాం మహార్ణవే।
సమేత్య చ వ్యపేయాతాం కాలమాసాద్య కంచన॥
ఏవం భార్యాశ్చ పుత్రాశ్చ జ్ఞాతయశ్చ ధనాని చ।
సమేత్య వ్యవధావన్తి ధ్రువో హ్యేషాం వినాభావః॥

(వా. రా. అ. 105.26-27)

రెండు ప్రవాహాల నుంచి కొట్టుకొచ్చిన రెండు కట్టెలు సముద్రంలో కొంత దూరం కలసి ప్రయాణిస్తాయి. కొంత కాలానికి విడిపోతాయి. అలాగే భార్యలు, పుత్రులు, ధనధాన్యాలు దాయాదులు, మనతో కొంత కాలం కలసి ఉంటారు. మళ్లీ కొంతకాలానికి ఎవరి దోవన వాళ్లు పోతారు. ఏ జీవికాజీవి విడివిడిగా ఉండటమే శాశ్వతమైన సత్యం. కలిసి ఉండటం తాత్కాలికం మాత్రమే.

వీళ్లంతా శాశ్వతంగా కలసే ఉంటారని భ్రమపడతాడు మానవుడు. అందుకనే వియోగంలో విపరీతంగా బాధపడతాడు. సంయోగం నిమిత్త కల్పితం. దానికోసం బంధాలు పెంచుకోకూడదు. బంధాలు ఎక్కువగా పెంచుకుంటే భవిష్యత్తులో బాధపడాల్సి వస్తుంది.

### 11.1.2 సుఖదుఃఖాలు :

ఎప్పుడూ సుఖమే ఉంటుందని కాని, ఎప్పుడూ కష్టమే ఉంటుందని కాని చెప్పడం కష్టం. ఒకప్పుడు సుఖం కలుగుతుంది. ఇంకొకప్పుడు కష్టం వస్తుంది. ఈ రెంటిని సమంగా భావించడం నేర్చుకోవాలి.

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ,
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి.
(భ. గీ. 2.38)

సుఖం కల్గినప్పుడు ఒళ్లు తెలియకుండా అహంకారంతో ఉబ్బితబ్బిబ్బులు కావడం, దుఃఖం వచ్చినప్పుడు నీరసించి కుప్పకూలిపోవడం ఉత్తమ లక్షణం కాదని మనసాహిత్యం చెబుతున్నది.

సుఖదుఃఖాలను, లాభనష్టాలను, జయాపజయాలను సమంగానే తీసుకోవాలి. అంతేగాని ఒకప్పుడు పొంగిపోకూడదు. ఇంకొకప్పుడు కుంగిపోకూడదు.

### 11.2 స్థితప్రజ్ఞ :

చెదరని బుద్ధినే స్థితప్రజ్ఞ అంటారు. అది కలవాణ్ణి స్థితప్రజ్ఞుడు అంటారు. అలాంటి ప్రజ్ఞను సంపాదించడం చాలా కష్టం. చుట్టూతా ఎన్ని కష్టాలున్నా మనస్సు సంక్షోభానికి గురికాకూడదు. తను ఎన్ని సుఖసంతోషాల మధ్యనున్నా ఒళ్లు దగ్గఱ పెట్టుకోవాలి. రాగాన్ని భయాన్ని క్రోధాన్ని దగ్గఱకు రానీయకూడదు. అప్పుడే బుద్ధిలో నిలకడ ఏర్పడుతుంది.

దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః,
వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే.
(భ. గీ. 2.56)

ఇది చాలా కష్టసాధ్యం. అయితే నిరంతర సాధనవల్ల తప్పకుండా సిద్ధిస్తుంది.

## 11.3 జ్ఞాన గరిమ :

ఈ లోకంలో జ్ఞానానికున్న స్థానం ఏ వస్తువుకూ లేదు. ఎందరో ధనాధికులు, వయోధికులు, విద్యాధికులు ఈ లోకంలో ఉండవచ్చు. కాని వాళ్లందరు జ్ఞాన వృద్ధులకు సేవకులు. వారి శిష్యులకు సేవకులు. వాట న్నింటికి జ్ఞానం తరువాతనే విలువ నివ్వాలి.

ధనవృద్ధా వయోవృద్ధా విద్యావృద్ధాస్తథైవ చ।
తే సర్వే జ్ఞానవృద్ధస్య కింకరాః శిష్యకింకరాః॥

జ్ఞాన వృద్ధులముందు భౌతికమైన సిరిసంపదలు, వయస్సు, విద్యా యోగ్యతలు దేనికీ పనికిరావు. జ్ఞానంతో సమానమైనది ఈ లోకంలో ఇంకొకటి లేనే లేదు.

## 11.4 మనస్తత్వం :

మానవుని మనస్సు అసలే చంచలమైన కోతి లాంటిది. ఆ కోతి లాటిచెట్టుపై కెక్కి మనస్సును తల్లకిందులు చేసే కల్లు తాగింది. దిగి వస్తున్నప్పుడు దాన్నొక తేలుకుట్టింది. అది చాలదా అన్నట్లు ఒక పిశాచం కూడా పట్టింది. ఇక దాని చాంచల్యం గురించి చెప్పాల్సిందేముంది.

కపిరపి చ కాపిశాయన మదమత్తో వృశ్చికేన సందష్టః।
అపి చ పిశాచగ్రస్తః కిం బ్రూమస్తస్య వైచిత్ర్యమ్॥

ప్రతివాడు అలాంటి మనస్సును వదిలివేయకుండా ప్రయత్నపూర్వకంగా స్వాధీనంలో పెట్టుకోవాలి. లేకపోతే అది అనేకానర్థాలను తీసుకువస్తుంది.

మానవుడు సంసారబద్ధుడైనా లేక విముక్తుడైనా దానికి కారణం మనస్సే. విషయాసక్తమైన మనస్సు బంధాన్ని కలిగిస్తుంది. నిర్విషయమైన మనస్సు ముక్తిని కలిగిస్తుందని పెద్దలిలా చెబుతారు.

మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః।
బంధాయ విషయాసక్తం ముక్తం నిర్విషయం స్మృతమ్॥

(బ్ర. బి. ఉ. 2)

## 11.5 సర్వం భగవన్మయం :

ఈ లోకంలో అణువణువునా భగవంతుడున్నాడు. సమస్తం భగవన్మయమే. భగవంతుడిలా చెబుతున్నాడు--

"నాకంటే భిన్నమైందేదీ లేదు. దారానికి మణులు గుచ్చినట్లు ఇదంతా నాతో కూర్చబడిందే."

మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥

(భ. గీ. 7.7)

అందుకనే భగవంతుణ్ణి ప్రతి వ్యక్తిలోను దర్శించడానికి ప్రయత్నం చేయాలి.

## 11.6 మాయ :

సత్త్వం, రజస్సు, తమస్సు ఈ మూడు గుణాల వికారమే మాయ. ఇది భగవంతుని చేతిలో పనిముట్టు. దాన్ని దాటాలంటే ఎవరివల్లా కాదు. ఆయనకు శరణాగతి చేసినవాళ్లే ఈ మాయను తెలిసికోగలుగుతారు.

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే॥

(భ. గీ. 7-14)

మాయలో పడి మనం మన ఆత్మ స్వరూపాన్నే తెలిసికోలేక పోతున్నాం. ఆయన అనుగ్రహిస్తే ఆ మాయ పోయి స్వస్వరూపం ఎరుకలోకి వస్తుంది.

## 11.7 అంతర్యామి :

భగవంతుడు పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చ అని అయిదు విధాలుగా ఉన్నాడు. అందులో అంతర్యామిగా ప్రతి జీవి హృదయగుహలో కొలువుదీరి ఉన్నాడు. జీవులందరిని గిరగిర తిప్పుతున్నాడు.

ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి।
భ్రామయన్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥

(భ. గీ. 18-61)

అందువల్లనే ఏ జీవిని తిరస్కరించకూడదు. ఎవరిని తిరస్కరించినా అది భగవంతునికే చేరుతుంది.

## 11.8. అభయం :

దేవుణ్ణి పూర్తిగా నమ్మి అనన్యభక్తితో సేవించే వారికి అభయానికి లోటుండదు. మానవుడెప్పుడూ రెండు పడవలమీద కాళ్లు వేస్తాడే గాని ఏదో ఒకదాన్ని పూర్తిగా నమ్మలేడు. అందువల్లనే అతడికి భగవంతుని అభయం లభించదు.

అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

(భ. గీ. 9.22)

ఎవరు అనన్యభక్తితో ఆయననే ఉపాసన చేస్తారో అటువంటి నిత్యాభియుక్తులైన ఆశ్రితులకు భగవాన్ అనుగ్రహం ఎప్పుడూ ఉంటుంది. వారి యోగక్షేమాలను ఆయనే పరిరక్షిస్తుంటాడు.

## 11.9 దైవానుగ్రహం :

ఎంతటి భుజబలమున్నా, బుద్ధిబలమున్నా దైవబలం లేనిదే ఏపనీ జరుగదు. అందుకే మనం ఎప్పుడూ దైవానుగ్రహాన్ని ప్రార్థించి ఏపనైనా చేయాలి. దైవానుగ్రహం ఉంటే తన రక్షణకోసం ఎప్పుడూ ఆలోచించనక్కర్లేదు. ఆయనే అన్ని విధాలా మనల్ని కాపాడుతాడంటున్నది ఋగ్వేదం--

ఇన్ద్రో ఆశాభ్య స్పరి సర్వాభ్యో అభయం కరత్।
జేతా శత్రూన్విచర్షణిః॥ (ఋ. సం. 2.41. 12)

భగవంతుడు మనకు కలిగే అన్ని విధాల ఉపద్రవాలను పోగొడతాడు. ఆయన అనుగ్రహం సంపాదించిన వాడికి ఏవైపునుంచి ఎలాంటి భయం సంభవించదు. అతడికి అన్ని విధాలా శుభమే కలిగితీరుతుంది. భగవంతుడా! మాకు అన్ని వైపులనుంచి అభయాన్ని అనుగ్రహించు!

## 11.10 మరణం :

ఈ లోకంలో మానవుడు ఎన్ని రకాల భయాలనైనా తట్టుకోవచ్చు గాని మరణ భయాన్ని మాత్రం తట్టుకోలేడు. ఎందువల్ల? మరణమంటే సరైన అవగాహన లేకపోవడం వల్ల. మృత్యువు ఎక్కడో యమలోకంలో ఉందనుకోకూడదు. అది మీ వెంటనే ఉంటుందని రామాయణంలో శ్రీరామచంద్రుడు ఇలా ఉపదేశిస్తున్నాడు--

సహైవ మృత్యుర్వ్రజతి సహ మృత్యుర్నిషీదతి।
గత్వా సుదీర్ఘమధ్వానం సహ మృత్యుర్నివర్తతే॥
(వా. రా. అ. 105.22)

నీ మృత్యువు ఎక్కడో దూరంగా లేదు. అది నీతోనే వస్తుంది. నీ దగ్గతే కూర్చుంటుంది. నీ ప్రయాణం ఎంత దూరమైనా అంతదూరం నీ వెంటనే ఉంటుంది. తిరుగు ప్రయాణంలో నీతోనే తిరిగి వస్తుంది.

నీ మృత్యువు ఎక్కడినుంచో ఎప్పుడో రాదు. నీతోనే ఉండి నిన్ను కబళించడానికి పొంచి ఉంటుంది. ఆయుష్యం పూర్తైనవాడికి అనిమిత్తం అట్టే దొరికిపోతుంది. అందుకని ఎప్పుడైనా దానికి సిద్ధంగా ఉండాలి.

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా।
తథా దేహాన్తరప్రాప్తిః ధీరస్తత్ర న ముహ్యతి॥

(భ. గీ. 2.13)

మరణమంటే ఏమిటో తెలుసా? ప్రతివాడికి జీవితం బాల్యంతో ప్రారంభమవుతుంది. కొన్నాళ్లకు అది గడిచిపోయి యౌవనం అంకురిస్తుంది. నాకు యౌవనం వచ్చిందనుకుంటుండగానే ముసలితనం వచ్చేస్తుంది. బాల్యం పోయిందని మనం బాధపడుతున్నామా? లేదు. అలాగే ఆత్మ ఈ శరీరంలో కొన్నాళ్లుండి దీన్ని వదిలిపెట్టి ఇంకో శరీరంలో ప్రవేశిస్తుంది. ఆ శరీరం కూడా శాశ్వతం కాదు. దాన్ని వదలి ఇంకో శరీరంలో ప్రవేశిస్తుంది. "ఈ శరీరం నాది" అని మమకారం పెంచుకుంటాడు ప్రతివాడు. ఆ మమకారం వల్లనే మరణమంటే గజగజ వణకుతాడు. మరణస్వరూపం అర్థమైతే బాధపడాల్సిన పనేలేదు.

## 11.11 పునర్జన్మ :

కొందఱు చపలమతులు పునర్జన్మ లేనేలేదని వాదిస్తారు. పుట్టిన ప్రతిదీ చనిపోక తప్పదు. అందుకే అది అశాశ్వతమౌతున్నది. పుడుతున్న వస్తువులు, వ్యక్తులు చనిపోవడం మనం చూస్తూనే ఉన్నాం. చనిపోయిన వాడు మళ్లా పుట్టక తప్పదు. మళ్లా పుట్టటాన్నే పునర్జన్మ అంటారు.

జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి॥

(భ. గీ. 2--27)

చావు పుట్టుకలు చాలా సహజమైనవి. కానీ మమకారం వల్ల అవి మనకు బాధను కలిగిస్తున్నాయి. ఎంతటి వైజ్ఞానికుడైనా చావక తప్పదు. మళ్లా పుట్టక తప్పదు. మన అధీనంలో లేకుండా తప్పనిసరిగా జరిగే విషయంలో మనం బాధపడటం ఎంత అవివేకమో ఆలోచించండి అంటున్నాడు భగవద్గీతలో వాసుదేవుడు.

పునరపి జననం పునరపి మరణం పునరపి జననీ జఠరే శయనమ్।
ఇహ సంసారే బహు దుస్తారే కృపయాఽపారే పాహి మురారే॥
(భ. గో. 22)

శంకరుల భజగోవిందస్తోత్రం వైరాగ్యఖని. జననం, మరణం, జననం ఇవి దాటడానికి ఎవ్వరికీ శక్యం కావు. ఓ స్వామీ ! ఈ జనన మరణ పరం పరనుంచి నన్ను కాపాడమంటున్నారు ఆచార్యులవారు. ఆయన అనుగ్రహ మొక్కటే ఈ సంసారం నుంచి జీవుణ్ణి తప్పించగలదనేది అక్షరసత్యం.

## 11.12 కాలప్రభావం :

కాలప్రభావాన్ని అంచనా వేయడం కష్టసాధ్యం. ఇలాగే జరుగుతుందని గట్టిగా చెప్పలేం. ఎప్పుడైనా ఎలాగైనా ఏదైనా కాలప్రభావంవల్ల జరగవచ్చు. కాలమనే వంటవాడు అజ్ఞానమయమైన ఈ లోకంలో సూర్యుడనే అగ్నిని, రాత్రింబగళ్లనే కట్టెలతో రగిల్చి పన్నెండు మాసాలు, ఆరు ఋతువులనే గరిటెలతో తిరగబెడుతూ ప్రాణులందరినీ వండుతున్నాడు.

అస్మిన్ మహామోహమయే కటాహే సూర్యాగ్నినా రాత్రిదినేంధనేన।
మాసర్తు దర్వీపరిఘట్టనేన భూతాని కాలః పచతీతి వార్తా॥
(మ. భా. వన. 313.72)

ప్రాణుల సుఖదుఃఖ ప్రారబ్ధాలవల్ల అనేక కార్యాలు లోకంలో జరుగుతుంటాయి. సూర్యుడు, రాత్రి, పగలు, మాసాలు, ఋతువులు ఇవన్నీ

జీవునికి కాలోపకారాల్లో అనేక కష్టసుఖాల నందిస్తున్నాయి. కాల ప్రభావం వల్ల అనుకోని పరిస్థితులు ఏర్పడుతున్నాయి. కనుక కాలమే అంతటికీ కారణమని గ్రహించాలి.

## 11.13 ఆశ్చర్యం :

ప్రతిరోజు ప్రాణులు చనిపోవడం చూస్తూ కూడా మానవులు "వాళ్లేదో చనిపోయినారుగాని మేము మాత్రం భూమి మీద స్థిరంగా ఉంటా" మనుకుంటారు. దానికి తగిన ఏర్పాట్లు చేసుకుంటుంటారు. అంతకంటే ఆశ్చర్యకరమైన అంశం ఏంకావాలి? అని ఇలా అంటాడు యక్షప్రశ్నకు యుధిష్ఠిరుడు --

అహన్యహని భూతాని గచ్ఛంతీహ యమాలయమ్।
శేషాః స్థావరమిచ్ఛన్తి కిమాశ్చర్యమతః పరమ్॥

(మ. భా. వన. 313.70)

పోయినవాళ్లు ఆయుష్యం లేకనో, జబ్బుల వల్లనో పోయినారు గాని నాకేం పరవాలేదని ప్రతివాడు అనుకోవడం చూస్తే నిజంగానే ఆశ్చర్యం కలుగుతుంది. పుట్టిన ప్రతివాడు పోవలసిందే. అయితే ఎవరి వంతు వచ్చేవరకు వారు ఎదురుచూడవలసిందే.

దుఃఖేనోపార్జ్యన్తే పాల్యన్తే ప్రత్యహం చ లాల్యన్తే।
వామాః స్త్రియో విమూఢైరుపభుంజానాః సుఖం ద్విగుణమ్॥

(వై. శ. 53)

లావణ్యవతులైన యువతులను ఎంతో శ్రమపడి సంపాదించుకుంటారు మూఢులైన పురుషులు. ప్రతిరోజు వారికిష్టమైన వస్త్రాలంకారాలనిచ్చి ముద్దు గిస్తుంటారు. కాని పురుషులకంటే రెట్టింపు సుఖాన్ని ఆ రమణీమణులే బెట్టుసరిలో అనుభవిస్తుంటారు. పాపం పురుషుల్ని చూస్తే జాలివేస్తుంది. ఇంతకంటే ఆశ్చర్యమేమున్నది?

## 11.14 విధి :

విధి బలీయమైంది. ఎంత గొప్పవాడైనా, ఎంతటి బలవంతుడైనా ఎంతటి మేధావి అయినా విధి చేతిలో కీలుబొమ్మ కాక తప్పదు. విధి నిర్ణయాన్ని అతిక్రమించడం గాని, మార్చడం గాని ఎవరివల్ల అయే పని గాదు. ప్రాణులు విధివశాత్తు తమకేర్పడిన సుఖాన్ని గాని, దుఃఖాన్ని గాని అనుభవించి తీరవలసిందే. దాన్ని ఎదుర్కోవడం జీవులవల్ల కానే కాదని మహాభారతమిలా చెబుతున్నది --

సుఖం వా యది వా దుఃఖం భూతానాం పర్యుపస్థితమ్।
ప్రాప్తవ్యమవశైః సర్వం పరిహారో న విద్యతే॥

(మ. భా. శాంతి. 28.17)

విధిశాసనాన్ని ఎవ్వరూ ఉల్లంఘించలేరు. అది అనుభవించక తప్పదు.

"నా భుక్తం క్షీయతే కర్మ" అని పెద్దలంటారు. పురాకృత సుకృత దుష్కృతాలు కర్తను ఎన్నటికీ వదిలిపెట్టవు. గుంపులో వేలకొలది ఆవులు న్నప్పటికీ లేగదూడ తనతల్లిని ఎలా వెదుక్కొని వస్తుందో అలాగే కర్మలు వెదకి వెదకి కర్తయైన ప్రాణిని పట్టుకొని తీరతాయి.

యథా ధేనుసహస్రేషు వత్సో విందతి మాతరమ్।
తథా పూర్వకృతం కర్మ కర్తారమనుగచ్ఛతి॥

(మ. భా. శాంతి. 181.16)

ఎక్కుపెట్టి వదిలిన బాణం ఎలా లక్ష్యాభిముఖంగా ముందుకు దూసుకు పోతుందో అలాగే ప్రారబ్ధకర్మ కర్త వైపు దూసుకు వస్తుంటుంది. తగిన ఫలాన్ని అనుభవింపజేసే వదులుతుంది.

యస్మాచ్చ యేన చ యథా చ యదా చ యచ్చ
యావచ్చ యత్ర చ శుభాశుభమాత్మ కర్మ।
తస్మాచ్చ తేన చ తథా చ తదా చ తచ్చ
తావచ్చ తత్ర చ విధాతృవశాదుపైతి॥

ఏ కారణం వల్ల ఎలా ఏ ప్రకారం, ఎప్పుడు, ఎంత, ఎక్కడ, పుణ్య పాపరూపమైన ఎలాంటి కర్మను మానవుడు చేశాడో, అదే కారణం వల్ల, అలాగే, ఆ ప్రకారమే, అప్పుడే, అంత, అక్కడే, అదే కర్మఫలాన్ని విధివశాన జీవుడనుభవిస్తున్నాడని పెద్దలమాట.

## 11.15 మహాత్ములు :

'వీడు మన వాడా? పరాయివాడా?' అనే ఆలోచన సంకుచిత మైన మనస్సుగలవారికే గాని విశాలదృష్టి కలవారికుండదు. ఉదారమైన చరిత్ర కల మహాత్ములకు ఈ భూమి అంతా ఒకే కుటుంబమనే భావన ఉంటుంది. మనవాడు, పరాయివాడనే భేదబుద్ధి ఉండదు.

అయం నిజః పరో వేతి గణనా లఘుచేతసామ్।
ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకమ్॥

మనస్సు ఎదిగితేనే మహాత్ముడవుతాడు. మనస్సు చిక్కిపోతే దురాత్ముడే అవుతాడు.

సాధువులు "వీడు గుణరహితుడా? సద్గుణాలు కలవాడా?" అని ఆలోచించకుండానే వాడిపై దయావృష్టిని కురిపిస్తారు. చంద్రుడు "వీడు చండాలుడు కదా! "అని వాడింటిపైన వెన్నెల కాయకుండా మిగతా చోట్ల మాత్రమే తన వెన్నెలను ప్రసరింపచేస్తాడా? లేదు. అన్ని చోట్ల వెన్నెలను కురిపిస్తాడు.

నిర్గుణేష్వపి సత్త్వేషు దయాం కుర్వన్తి సాధవః।
న హి సంహరతే జ్యోత్స్నాం చన్ద్రశ్చాండాలవేశ్మని॥

మహాత్ములకు స్వపరభేదాలుండవు. నీచాత్ములకే స్వపర తారతమ్యం హెచ్చుగా ఉంటుంది.

లోకోత్తరులైన మహామభావుల మనస్సును తెలుసుకోవడం చాలా కష్టం. అది కాఠిన్యం వహించాల్సివస్తే వజ్రంకంటే కఠినంగాను, మృదువుగా ఉండాల్సి వస్తే కుసుమం కంటే మృదువుగాను ఉంటుంది.

వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి।
లోకోత్తరాణాం చేతాంసి కో హి విజ్ఞాతుమర్హతి॥

మహాత్ముల నర్థం చేసుకోవడం చాలా కష్టమైన పని. వారి స్వభావం సముద్రగంభీరంగా ఉంటుంది. వారి ఆలోచనలు సుమేరుసమున్నతాలుగా ఉంటాయి.

## 11.16 అవమానాన్ని ఆహ్వానించాలి :

అందరు తనను ప్రశంసించాలని ప్రతి వాడికి లోపల ఆశగా ఉంటుంది. ఎవరైనా పరోక్షంగా తనను తక్కువ జేశాడని తలిస్తేనే హృదయంలో దావానలం బయలు దేరుతుంది. కాని అది చాలా పొరపాటని ఇలా నారద పరివ్రాజకోపనిషత్ తెలియజేస్తున్నది --

సమ్మానాద్ బ్రాహ్మణో నిత్యముద్విజేత విషాదివ।
అమృతస్యేవ చాకాంక్షేదవమానస్య సర్వదా॥

(నా. ప. ఉ. 40)

ఎవరైనా మనల్ని సమ్మానిస్తే విషాన్ని చూచి బెదిరినట్లు బెదిరిపోవాలి. అంటే సమ్మానాకాంక్ష ఉండకూడదన్నమాట. ఎవరైనా తనను అవమానిస్తే అమృతాన్ని కోరినట్లు ఇంకా అలాంటి అవమానాన్ని కోరుకోవాలి. తప్పులేనప్పుడు ఇతరులవమానించినా బాధపడకూడదు. తప్పుచేసినప్పుడు ఇతరుల అవమానాన్ని శిరసావహించాలనేది లోకపు సామాన్య రీతి. కానీ సమ్మానాన్ని ప్రక్కకు నెట్టి అవమానాన్ని ఆహ్వానించగల్గడమనేది ఎంతో విశాలదృష్టి ఉంటేనే కాని జరగని పని.

## 11.17 ఆత్మవిశ్వాసం కావాలి :

ఆత్మవిశ్వాసమే వ్యక్తిగత విజయాలకు మూలకారణం. ఆత్మవిశ్వాసం లేనివాడు అన్నీ ఉన్నా ఏ కార్యాన్నీ సాధించలేడు. ఆత్మవిశ్వాసం ఉన్న వాడు ఎంత వ్యతిరేకత ఉన్నా స్వకార్యాన్ని సాధించుకుంటాడు. అయితే ఆత్మవిశ్వాసం దురభిమానం క్రింద మారకూడదు.

అమోఘక్రోధహర్షస్య స్వయం కృత్యాన్యవేక్షితుః।
ఆత్మప్రత్యయకోశస్య వసుదైవ వసుంధరా॥

(మ. భా. శాంతి. 120.30)

వ్యర్థంగా ఇతరులపై కోపాన్ని గాని హర్షాన్ని గాని ప్రదర్శించనివా నికి, స్వయంగా అన్ని పనులు చక్కబెట్టుకోగలవానికి, ఆత్మవిశ్వాసనిధి కలవానికి వసుంధర సకల సంపదలను అనుగ్రహిస్తుందని మహాభారతం ప్రబోధిస్తున్నది.

అతడిని అందరు ఆప్యాయతతో ఆదరిస్తారు. అనేకావకాశాలు ఏర్పడి అభ్యుదయ పథంలో అతడి జీవితం ప్రకాశిస్తుంది.

## 11.18 సమత్వ భావన :

సంస్కారపూర్ణమైన జాతిగా భారతజాతి ఏనాడో సమాజంలో సమ భావాన్ని ఆకాంక్షించింది. సమాజంలో ఉన్న వాళ్లందరు హెచ్చు తగ్గులు లేకుండా సమానంగా ఉండటం నేర్చుకోవాలని ఋగ్వేదం ఇలా ఆకాంక్షి స్తున్నది --

సమానీ వ ఆకూతిః సమానా హృదయాని వః।
సమానమస్తు వో మనో యథా వః సుసహాసతి॥

(ఋ. సం 10-191-4)

మన అందరి ఆశలు ఒకటిగా ఉండాలి. వాటిని సాధించడంలో మన అందరి హృదయాలు ఒకటి కావాలి. మన ఆలోచనలన్నీ ఒకే త్రాటిపైన నడవాలి. మనలో ఎలాంటి విభేదాలు లేకుండా ఒకటిగా ఉండి మంచి స్నేహితులంగా జీవించాలి.

ఆనాడు ఋగ్వేదం కోరినా ఈనాటి మానవుడు కోరినా ఆదే విశ్వ జనీనమైన ఆకాంక్ష.

## 12. ఉపసంహారం :

చరిత్రకందని కాలం నుంచి మానవ కల్యాణానికి అంకితమైన సంస్కృత సాహిత్యం అనేక ప్రక్రియలద్వారా మానవునికి అభ్యుదయాన్ని నిశ్శ్రేయసాన్ని అందించే ప్రయత్నంలో ఎన్నో ఉపదేశాల నందిస్తూ వచ్చింది. వేదాలను, ఇతిహాస పురాణాలను, శాస్త్రాలను, కావ్యాలను ఈ దృష్టితో పరిశీలిస్తే ఎన్నో ఉపదేశాలు కోకొల్లలుగా మనకు దర్శనమిస్తాయి. త్యాగానికి, యోగానికి, సత్యానికి, ధర్మానికి, శాంతికి, ప్రేమకు, అహింసకు అంకితమై మానవ జీవన వాహినిని పవిత్రీకరించి, సుగంధభరితం చేసిన మహనీయులెందరో ధ్రువతారల్లాగా మన సాహిత్యంలో దర్శనమిస్తారు. వారి జీవితాల నుంచి, వారి ఉపదేశాలనుంచి భారతజాతి ఎంతో నేర్చుకున్నది. వారి ఆదర్శాలను ఎంతగానో జీర్ణించుకున్నది.

ఆ వాఙ్మయ మహోదధిని మథించగా జన్మించిన ఉపదేశసుధలలో కొన్ని బిందువులను నిదర్శనాలుగా మాత్రమే మానవతావికాసానికి దోహదం చేస్తాయని, సహృదయులకు ఆనందాన్ని అందిస్తాయని సారభూతమైన అంశాలుగా ఇందులో పొందుపరచాను.

* * *

